చందా వివరములు
ఆంధ్ర దినపత్రిక

| | | రూ. | నయా పైసలు |
|---|---|---|---|
| (ఆదివారపు సంచికతోసహా) | | | |
| సంవత్సర చందా | ... | 28 | 00 |
| అర్ధ సంవత్సర చందా | ... | 14 | 00 |
| 3 మాసముల చందా | ... | 7 | 00 |
| నెల చందా | ... | 2 | 50 |
| విడిప్రతిసాధారణదినములలో | ... | ,, | 7 |
| ఆదివారపు దినపత్రిక | ... | ,, | 18 |

ఆంధ్ర పత్రిక — మద్రాసు-1.


# ఆంధ్రపత్రిక

3|7518




The Andhra Patrika - Madras సంపుటం 44. సంచిక 92 FOUNDER: DESODHARAKA K. NAGESWARA RAO బుధవారం 3-7-1957 Reg. No. M. 1118 6 పేజీలు 7 నయాపైసలు


# పారిశ్రామికాభివృద్ధికి కృషిచేసే వర్తకులకు ప్రభుత్వ సహాయం

బహుమతులుగా తపాలాపత్రాలు: బహూకరణ తపాలాపత్రాల అమ్మకానికి ప్రారంభోత్సవపూర్వకంగా, తంతి తపాలా మంత్రి లాల్ బహదూర్ ఢిల్లీలోని గోల్ తపాలాఫీసులో పండిత గోవిందవల్లభ్ పంతుకు, ఒకపత్రాన్ని అమ్ముతున్నారు. శ్రీ లాల్ బహదూర్ ప్రక్కనవున్నవారు తంతి తపాలా సహాయమంత్రి శ్రీ హుమాయూన్ కబీర్. చిన్న మొత్తాల పొదుపు ఉద్యమంలో భాగంగా ఈ బహూకరణ పత్రాల అమ్మకం తలపెట్టారు.

## స్వల్ప మొత్తాల పొదుపు

### ఉన్నతాధికార మండలి ఏర్పాటు

న్యూఢిల్లీ, జులై 1: జాతీయ పొదుపు ఉద్యమాన్ని పటిష్ఠంచేసి, విస్తృతంచేసే ఉద్దేశ్యంతో, స్వల్ప మొత్తాల పొదుపుకు, ఉన్నతాధికారాలుగల ఒక మండలిని నియమించటానికి ప్రభుత్వం నిశ్చయించిందని, రవాణా, తంతి, తపాలాశాఖ మంత్రి శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి ప్రకటించారు.

తపాలా బహుమ పత్రాల ప్రారంభోత్సవంలో ప్రసంగిస్తూ శ్రీ శాస్త్రి యీ విధంగా చెప్పారు. "రెండవ ప్రణాళిక అంచనాలకు, మన ఆర్థికావకాశాలకు మధ్య పెద్ద అంతరం ఉండిపోయింది. దేశంలో లభించే ద్రవ్యంపై నే మనం చాలావరకు ఆధారపడవలసి ఉన్నది. అదనపు సుంకాలు సహాయకారి కాగలవనటంలో సందేహం లేదు. అయితే పన్ను విధింపుకు కొంత పరిమితి అంటూ ఉన్నది. విదేశాలు ఇచ్చే ఋణాలవల్ల గూడా యీ అగాథం కొంత పూడుతుంది. కాని దీనిమీద పూర్తిగా ఆధారపడటానికి వీలు లేదు. అన్నిటికంటె, మన ప్రజలు స్వచ్ఛందంగా యిచ్చే ఋణాలు, పొదుపుచెయటం ద్వారా ప్రభుత్వానికి జమకట్టే స్వల్ప మొత్తాలు, మన ప్రణాళికకు అమోఘమైన పెట్టుబడి అవుతాయి.

ఈ చిన్న మొత్తాల పొదుపుకు, ప్రభుత్వం అనేక పథకాలను రూపొందించినప్పటికీ, తపాలాశాఖ యీ విషయంలో అత్యధికంగా కృషిసాగిస్తున్నందువల్ల, పొదుపు ఉద్యమవ్యాప్తికి యీ శాఖనే ప్రధాన అంగంగా ఉపయోగించాలని ప్రభుత్వం ఆలోచిస్తున్నది.

"కొత్తగా వివాహం అయిన దంపతులకు, యీ తపాలా బహుమతి పత్రాలను బహూకరిస్తే, వీరి నూతన వైవాహిక జీవితం పొదుపుతో ప్రారంభం అవుతుంది.

ఈ మొత్తాలమీద ఏటా నూటికి రు. 5040 నయాపైసలు సామాన్య వడ్డీ రు. 3-25 నయాపైసలు చక్రవడ్డీ చెల్లిస్తారు."

## కృష్ణా పుష్కరాల పరిసమాప్తి

విజయవాడ, జులై 2: కృష్ణా పుష్కరాలు నేటితో సమాప్తమైనవి. ఈ 12 రోజులలోను 1,25,000వేల మంది యాత్రికులకు పైగా కృష్ణానదిలో స్నానంచేసి పునీతులైనారు.

ఈ 12 రోజులలోను ఎక్కువ మంది యాత్రికులు కృష్ణలో స్నానం చేసినది జూన్ 30వ తేదిని. ఆ రోజున 28,000మంది యాత్రికులు నదిలో స్నానం చేశారు. క్రిందటి ఆరు రోజులలో దాదాపు ఒక లక్షమంది యాత్రికులు వివిధ ఘట్టాలవద్ద చేరుకొన్నారు.

పుష్కర ఉత్సవాలు ప్రశాంతంగా జరిగిపోయినవి. ఒక ప్రమాదం మాత్రం సంభవించినది. ఒక యాత్రికుడు నదిలో మునిగి ప్రాణాలు కోల్పోవడం తటస్థించినది.

## అంచెలవారీగా నిరాయుధీకరణ

### అణ్వస్త్ర పరీక్షా నిషేధంతో ప్రారంభించాలని నెహ్రూ వాదం

### కామన్వెల్త్ ప్రధానమంత్రుల సభలో అమెరికన్ ప్రతిపాదనల చర్చ

లండన్, జులై 1: క్లిష్టమైన నిరాయుధీకరణసమస్యను అంచెలవారీగా పరిష్కరించాలనీ, అణ్వస్త్ర పరీక్షల తాత్కాలిక నిషేధం మొదటి అంచెగా పరిష్కారానికి ఉపక్రమించాలనీ, భారతప్రధాని శ్రీ నెహ్రూ, ఇవాళ కామన్వెల్తు ప్రధానుల సమావేశంలో విజ్ఞప్తి చేశారు.

కామన్వెల్తు ప్రధానుల సమావేశంలో ఇవాళ నిరాయుధీకరణలో అమెరికా ప్రతిపాదిస్తున్న మొదటి దశ పథకాన్ని బ్రిటిష్ విదేశాంగ మంత్రి వివరించారట. దీనిపైకూడా చర్చ జరిగిందని తెలుస్తున్నది.

అణ్వస్త్ర పరీక్షల నిషేధం ఒక తుది లక్ష్యానికి సాధనమార్గం మాత్రమే; ఆ లక్ష్యాన్ని, అణ్వస్త్రాల విధ్వంసం విస్తృత నిరాయుధీకరణ, కాగా, పరీక్షలు నిషేధిస్తే, నిరాయుధీకరణ సాధనకు సరసమైన వాతావరణం ఏర్పడుతుంది, అని భారత ప్రధాని శ్రీ నెహ్రూ వాదించారు.

అణ్వస్త్ర పరీక్షలను నిషేధించవలసిన ఆగత్యం, నిరాయుధీకరణపై శీఘ్రంగా ఒప్పందం కుదుర్చుకోవలసిన అవసరం గురించి శ్రీ నెహ్రూ దీర్ఘ వాదన చేశారని తెలుస్తున్నది.

బ్రిటిష్ విదేశాంగ మంత్రి శ్రీ సెల్విన్ లాయిడ్, భారతదేశ వాదానికీ, పాశ్చాత్యుల వాదానికీ మధ్య కల ముఖ్యవ్యత్యాసం ప్రాథమిక సూత్రాలకు సంబంధించినది కాదని వివరించారట. అణ్వస్త్రాలూ, యుద్ధపరికరాలూ పాపపూరితమైనవే. అందరూ వానిపట్ల విముఖులే. కాని వ్యత్యాసమల్లా పౌర్వాపర్యాలను గురించే ఉన్నది అని శ్రీ లాయిడ్ అన్నారట.

అణ్వస్త్ర పరీక్షలతో పాటు, సమస్తంను అణ్వస్త్ర సామగ్రి ఉత్పత్తి మొదలైన వానిపైకూడా మొదటి దశలో ఒప్పందం కుదరాలని అమెరికా ప్రతిపాదిస్తున్న పథకాన్ని బ్రిటను, కెనేడియన్ ప్రతినిధులు సమర్థిస్తూ మాట్లాడారు.

కాని నిరాయుధీకరణవంటి క్లిష్ట సమస్యను మెట్టు మెట్టుగా పరిష్కరించుకుంటూ పోవాలని శ్రీ నెహ్రూ వాదించారట.

### అమెరికా ప్రతిపాదనపై చర్చ

లండన్, జులై 1: అణ్వస్త్ర పరీక్షలను తాత్కాలికంగా నిలపడంతో పాటు, మొదటి దశ ఒప్పందంలో అమెరికా ప్రతిపాదిస్తున్న అంశాలను బ్రిటిషు విదేశాంగమంత్రి శ్రీ సెల్విన్ లాయిడ్, ఇవాళ కామన్వెల్తు ప్రధానమంత్రుల సమావేశంలో వివరించినట్లు తెలుస్తున్నది. దీనిపై చర్చ జరిగింది.

ఈ ప్రతిపాదనలను అమెరికన్ ప్రతినిధి శ్రీ స్టాసెన్ రేపు మధ్యాహ్నం సమితి నిరాయుధీకరణ ఉపసంఘంలో ప్రవేశపెటగలరని తెలుస్తున్నది. ఈ ప్రతిపాదనలను ఉపసంఘంలో బ్రిటన్, ఫ్రాన్సు, కెనడాలు బలపరుస్తాయట.

అణ్వస్త్ర పరీక్షలను తాత్కాలికంగా నిషేధించడంతోపాటు ఈ క్రింది అంశాలను కూడా శ్రీ స్టాసెన్ ప్రతిపాదిస్తారని తెలుస్తున్నది.

1. సాధారణ ఆయుధ సామగ్రి తగ్గింపు.
2. గట్టి బందోబస్తుతో తనిఖీ పద్ధతి.
3. అకస్మాత్తుగా దాడులు జరగకుండా తగిన అదుపులు.
4. ఒక కొంత వైమానిక పరిశీలన.
5. అణ్వస్త్ర సామగ్రి ఉత్పత్తి మానివెయ్యడానికి తేదీ నిర్ణయం.

శ్రీ సెల్విన్‌లాయిడ్ ఈ అంశాలను వివరించారట; కాని అణ్వస్త్ర పరీక్షలను ఎంతకాలం నిలపాలని ప్రతిపాదించనున్నారో చెప్పలేదట.

అణ్వస్త్ర పరీక్షల నిలుపుదలతో పాటు, అణ్వస్త్ర సామగ్రి ఉత్పత్తి నిలుపుదలకు కూడా ఏక సమయంలో ఒప్పందం కుదరాలనే వాదాన్ని, కామన్వెల్తు ప్రధానుల సమావేశంలో పలువురు ప్రతినిధులు బలపరిచారని తెలుస్తున్నది.

వీనితోపాటు సాధారణ ఆయుధ సామగ్రిని తగ్గించడానికి కూడా ఒప్పందం కుదుర్చుకుంటేఅణ్వస్త్రాలునిర్మించని రాజ్యాలకుయుద్ధోత్పత్తి వ్యయభారం తగ్గుతుందనీ, యుద్ధావకాశాలు కూడా తగ్గగలవనీ, చాలమంది ప్రతినిధులు అభిప్రాయ పడుతున్నారు.

అణ్వస్త్రాలను గురించి మాత్రమే ఒప్పందం కుదుర్చుకుంటే, అన్ని రాజ్యాలకంటె రష్యాకు ఆయుధ బలం సైనిక బలం అత్యధికంగా మిగిలి పోగలదని కొందరు అన్నారు.

నిరాయుధీకరణలో మొదటి మెట్టు ఒప్పందం కుదురుతుందని, బ్రిటిష్ విదేశాంగ మంత్రి శ్రీ లాయిడ్ ఆశతో ఉన్నారట. ఎందువల్లనంటే రష్యా అమెరికా బ్రిటన్‌లు కొంతుండా ఇతర

(5 పుట చూడుము)

## 'ఎరువుల ఫ్యాక్టరీ స్థాపించండి' అని వాణిజ్యమండలికి సంజీవరెడ్డి సలహా

మదరాసు, జులై 2: ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి ఆంధ్రప్రదేశ్‌లో పరిశ్రమల అభివృద్ధికి తోడ్పడాలని వర్తకులకు విజ్ఞప్తిచేసి ఈ సందర్భంలో వర్తకులకు ప్రభుత్వసహాయం సంపూర్ణంగా వుండగలదని హామీ ఇచ్చారు. ఎరువుల ఫ్యాక్టరీ స్థాపనకు వర్తకులు పూనుకోవాలని సలహా ఇచ్చారు.

శ్రీ సంజీవరెడ్డికి నిన్న సాయంత్రం ఆంధ్ర వాణిజ్యమండలి కార్యాలయం వద్ద మండలి అధ్యక్షుడు శ్రీ వి. వేణుగోపాల్, కార్యవర్గ సభ్యులుస్వాగతం ఇచ్చి సన్మానపత్రం సమర్పించారు.

"ఆంధ్రకు రెండవ ప్రణాళికలో రు 174.6 కోట్లు కేటాయించారు. ఇది మొత్తం ప్రణాళికలో 3.63% అవుతుంది. జనాభాను బట్టి విస్తీర్ణం బట్టి చూస్తే చాలా తక్కువ. ఇదేగాక పారిశ్రామికాభివృద్ధికిగల అవకాశాలు, అవసరాల దృష్ట్యాకూడా ఆంధ్రవాటా చాలా తక్కువగావుంది. ఆంధ్రప్రదేశ్ ఆర్థికాభివృద్ధి ముందు వ్యవసాయంమీద, తరువాత ఖనిజసంపద, అటవిక సంపద మీద ఆధారపడివుంది. కనుక వ్యవసాయాభివృద్ధికి దోహదంచేసే పరిశ్రమలను స్థాపించటం అవసరం. ఎక్కడ ఏ పరిశ్రమలు పెట్టాలనే విషయాన్ని ప్రాంతీయమండలి సమావేశంలో చర్చించి దక్షిణాదిన పరిశ్రమలు సమంగా సమగ్రంగా వృద్ధిఅవటానికి ప్రయత్నించాలని కోరుతున్నాం. ఆంధ్రప్రదేశ్‌లో భారీపరిశ్రమల స్థాపన జరగటంకూడా అవసరం. ఇందువలన అనేక చిన్నపరిశ్రమలు, మధ్యరకం పరిశ్రమలు ఏర్పడేందుకు అవకాశం వుంటుంది. అన్నింటికంటే ముందు ఒక ఎరువుల కర్మాగారం ఏర్పడటం అవసరం. చిన్నగరోహాల్లో దుక్క ఇనుము కొలిమిని ఏర్పాటుచేసే అవకాశం వుంది. ఇనుము బొగ్గేగాక ఇంకా అనేకం ఖనిజాలు వున్నాయి. వానినిగురించి సమగ్రమైన ఖనిజ పరిశోధన జరపటం అవసరం. ఈ సందర్భంలో గనుల త్రవ్వకానికి అనుమతులు రావటంలో చాలా ఆలస్యం జరుగుతూవుంది. ఖనిజ వ్యాపారానికి ప్రభుత్వ వాణిజ్య సంస్థను ఏర్పాటు చేస్తారని తెలిసింది. అటువంటిపని జరిగేముందు వర్తకులతో సంప్రదించి చేయవలసిందిగా కోరుతున్నాం. ప్రణాళిక రచనా సంఘాలలో వర్తకులకు ప్రాతినిధ్యం ఇవ్వాలి.

పరిశ్రమల అభివృద్ధికి రవాణా సౌకర్యాలు వుండాలి. కోస్తావ్యాపారాన్ని వృద్ధిచేస్తే రవాణా రద్దీతగ్గుతుంది. ఈసందర్భంలో కాకినాడ, మచిలీపట్నం రేవులనుబాగుచేసే సావకాశం వుంది. చిన్న రేవుల అభివృద్ధికి పెద్దరేవుల వ్యాపారం కొంతను చిన్న రేవులకు మళ్ళించటం అవసరం.

అభ్రకం, మాంగనీస్, ఇనుము, వర్జీనియా పొగాకు, నాటుపొగాకు పసుపు ఎగుమతి వ్యాపారమును కొను గోలు పన్నునుంచి మినహాయించాలి. పూర్వం వలెవర్తకులకు ప్రభుత్వ కార్యకలాపాలు శీఘ్రంగా తెలియుటం లేదు. గెజెటు పనిరోజులు దాటితేగాని అందటం లేదు.

హైదరాబాదులో త్వరలోనే ఆంధ్ర వాణిజ్యమండలిశాఖను ఏర్పాటు చేయదలచాం దానిని ప్రారంభించాలని మిమ్ములను కోరుతున్నాం" అని శ్రీ వేణుగోపాల్ చెప్పారు.

శ్రీ సంజీవరెడ్డి ఇంకా ఇల్లా అన్నారు. "ఆంధ్రప్రదేశ్‌లో పరిశ్రమాభివృద్ధి బాధ్యత ప్రభుత్వము పైనా, వర్తకులపైనా వుంది. అందువలన వర్తకుల సలహాలను జాగ్రత్తగా పరిశీలిస్తాను. దేశంయొక్క అభివృద్ధి దాని వర్తక వాణిజ్యాలపైన ఆధారపడి వుంటుంది.

పూర్వపు ఆంధ్రరాష్ట్రంలో పరిశ్రమలు లేవనే చెప్పవచ్చును. రాజమండ్రిలో కాగితంమిల్లు గూడూరు పింగాణీ పరిశ్రమ తప్ప మరేమీలేవు. అవికూడా సరిగా లేవు. పంచదార పరిశ్రమ మాత్రం బాగున్నది. బోధన్‌లో బ్రహ్మాండమైన చక్కెర కర్మాగారం వుంది. ఆంధ్ర ప్రదేశ్ ఏర్పడిన తరువాత అయిదారు పరిశ్రమలు వచ్చాయి. వానిని సక్రమంగా వృద్ధిచేసుకుంటే చాలా లాభంగా వుంటుంది. కాని వాని స్థితికూడా బాగా లేదు. యాజమాన్యం లోపంవల్ల ఇవన్నీ అల్లావున్నాయి.

సింగరేణి బొగ్గుగనులను వృద్ధిచేయవచ్చును. అక్కడ చవకగా విద్యుచ్ఛక్తి తయారు అయ్యే అవకాశాలు ఉన్నాయి. వచ్చేనెల 10, 11 తేదీల్లో అక్కడికి వెళ్ళి పరిశీలించదలచాను. ఉత్పత్తి ఖర్చు ఎక్కువ, నాణ్యం తక్కువ అని అన్నారు. విచారించవలసివుంది. ప్రాగా కర్మాగారమును అభివృద్ధి చేయటానికి కేంద్ర సహాయం కోరాం. ఈసంస్థ బాగుపడి ఆంధ్రదేశానికేగాక దేశానికంతకు ఉపకరిస్తుందని ఆశిస్తున్నాను. బోధన్ లోని చక్కెర ఫ్యాక్టరీని ఇంకా అభివృద్ధిచేసే అవకాశంవుంది. ఇక్కడ పత్రికలకు పనికివచ్చే కాగితం తయారుచేసే కర్మాగారం ఏర్పాటుచేయాలని వుంది. చెరకుపిప్పిని కాగితం తయారీకి ఉపయోగించవచ్చును. త్వరలోనే ఈ కార్యం నెరవేరుతుందని అనుకుంటున్నాను.

ఎరువుల ఫాక్టరీ గూర్చి ప్రస్తావించారు. మన ప్రాంతానికి రాకపోవటం విచారకరం. 2 లక్షల టన్నుల ఎరువు వాడే ప్రాంతంలో ఒక్క కర్మాగారం లేక పోవటం బాధగానే వుంది. ఈ చిన్నవిషయంలో కూడా పనికావటంలేదు వుంది. ప్రభుత్వం వల్ల కాకపోతేప్రయివేటువ్యక్తులుముందుకు రావచ్చును. ఆంధ్ర వాణిజ్యమండలికి ఇది అసాధ్యమైన విషయం అనుకోను. ఎవరైనా ముందుకువస్తే ప్రభుత్వం తప్పకుండా సహాయం చేస్తుంది. అవిమయమై ఆలోచించగోరుతాను. ప్రజలకు ఏదైనా చేయాలని వుందగాని ఇటీవలి పన్నుల విధానం వలన పీనుకొంటు తున్న మాట నిజం. ఇబ్బువున్న వారిమీదకూడా పన్ను వేయకపోతే ఇంకా ఎవరిమీద వేయాల? ఎల్లకాలం రైతులమీదనే పన్ను వేసేది. ఇతర దేశాలతో పోల్చుకుంటే మనదేశంలో పన్నుల భారం తక్కువ. పన్ను మన లాభంకోసం మనం ఇచ్చుకునేది. ముందు తరాల వారి సౌభాగ్యం కోసం ఇచ్చుకునేది. ఈ మండలికి హైదరాబాదు మండలికి సన్నిహిత సంబంధం వుండాలని ఇప్పుడే మీ అధ్యక్షుడు సూచించారు. హైదరాబాదులో శాఖ కార్యాలయం ఏర్పాటు అయితే దరిమిలా ఏకీకరణకు దారి తీస్తుంది. ఈ నెల 23వ హైదరాబాదులో శాఖను ప్రారంభించమని కోరారు. అందుకు సంతోషంగా అంగీకరిస్తున్నాను. నాకు చేతనైనంత సహాయం చేస్తాం. మీరు వృద్ధిలోకి రావాలి. దేశాభివృద్ధి మీ అభివృద్ధిమీద ఆధారపడి వుంది. అయితే మీ అభివృద్ధి సర్వజనోపయోగంగా వుండాలి. నాకు పరిశ్రమలు అంటే తెలియదు. అందువలన నాకు మంచిసలహా ఇచ్చి నన్ను మీకు, మీదేశానికి ఉపయోగంగా వుండేటట్లు మల్చుకోండి.

రాష్ట్ర వ్యాపారసంస్థ విషయంలో ఇంకా తుది నిర్ణయం తీసుకోలేదు. నిర్ణయంచేసే ముందు మీతో కూడా తప్పకుండా సంప్రదిస్తాం. మీ అధ్యక్షుడు ఇంకా అనేక విషయాలను గూర్చి ప్రస్తావించారు. వానిని శ్రద్ధగా పరిశీలించగలను" అని అన్నారు.

ఆంధ్ర వాణిజ్య మండలి ఉపాధ్యక్షుడు శ్రీ వి. ఎం. బెరుమనార్ చెట్టి వందనములర్పించారు.

## ద్రవ్యోల్బణం కంటె పెద్ద సమస్య ధరలవృద్ధి

### వర్షాభావాల మూలంగా ధరలు పెరుగుతున్నాయని వాదం

బొంబాయి, జులై 1: దేశంలో బాధ కల్గించడానికి సమర్థమైనంతగా ద్రవ్యోల్బణం పెరగలేదు. ఆపరిస్థితి ఇంకా ప్రారంభంగూడా కాలేదు. దేశానికి బాధ, అహార ధాన్యాల ధరలు పెరిగినందువల్ల కల్గుతున్నదిగాని, మరి యెందువల్లను, కల్గడంలేదు" అని రిజర్వుబ్యాంకువారు చెబుతున్నారు.

ఈధరలు ఇట్లా పెరగడానికి, ఈ వర్షాభావము, అధికవర్షాలు, ఇతరమైన ఈతి బాధలు కారణంగాని, ద్రవ్యోల్బణం కారణం కాదన్న భావం గూడా రిజర్వుబ్యాంకుకు వున్నట్లు తోస్తోంది. 1953-54 లో మాత్రం పంటలు బాగా పండలేదు. అప్పటినుంచివర్షాభావమో, అధిక వర్షమో పడి, ధరల పరిస్థితిని, కాలమే తారుమారు చేస్తున్నది. అందువల్ల ఈ సంవత్సరం వర్షాలు గనుక బాగావుంటే ధరలను గూర్చి ఎటువంటి భయము వుండదు" అని వీరు అంటున్నారు.

ఆహార ధాన్యాల ధరలు పెరక్కుండా తను చర్యలను గూడా రిజర్వు బ్యాంకు అవలంబిస్తున్నది. బ్యాంకులు, వర్తకులకు, అప్పులు అధికంగా ఇవ్వరాదనడం ఇందులో ఒకటి. ఈ పనిని రిజర్వుబ్యాంకు విధిగా చేయవలసి వచ్చింది. 1956 మే 26వ ధరలసూచి 3482 గా వుంది. 1957 జూన్ 15 నాటికి అది 326.6 కు పెరిగింది. ఇది ఆహారధాన్యాలను సంబంధించి నంతవరకు మాత్రమే జరిగింది. పారిశ్రామిక వస్తువులసంగతి ఇట్లాలేదు. 1956 మే లో ఈ వస్తువుల ధరల సూచి 376.9 గా వుంది 1957 జూన్‌లో 498.1 గా మాత్రమే తేలింది. మొత్తం అన్ని సరుకుల టోకుధరల సూచిలో ఇందువల్లనే ఈ ఒక్కసంవత్సరంలోను పెద్దమార్పువచ్చింది. ఈ ధరలు 1956 మే లో 391.1 దగ్గరవున్నాయి 1957 జూన్ 15 నాటికి 437.6 దగ్గరకు వచ్చాయి.

అదీగాక జరిగిన 5 సంవత్సరాల లోను, అభివృద్ధి ఖర్చులు గూడా పుష్కలంగా పెరిగాయి. 1951-52లో ఈ ఖర్చులు రు. 259 కోట్లుగామాత్రం వుండేవి. 1956-57 లో రు. 761 కోట్లు ఖర్చు అవుతున్నాయి. 1957-58 లో ఈ ఖర్చులు రు. 900 కోట్లదాకా పెరగవచ్చునని తోస్తోంది.

బ్యాంకు ఇస్తున్న అప్పులుగూడా ఇదేపద్ధతిలో పెరుగుతూ వచ్చాయి. 1951-52 లో తరుణ ఋణాలుగా బ్యాంకులు 70 కోట 50 లక్షల రూపాయలుమాత్రం వినియోగించాయి. 1956-57 లో ఆదేరకం ఋణాలు 146 కోట్లదాకా ఇవ్వడం జరిగింది.

పరిస్థితి ఇట్లావున్నందువల్ల, దేశంయొక్క ఆర్థికస్థితిని, ద్రవ్యోల్బణం ఒత్తిడులకు లోనుగాకుండా రక్షించుకునేందుకుగాను, బ్యాంకులన్నీ జాగ్రత్తపడవలసిన అవసరంవుంది అని రిజర్వు బ్యాంకువారు హెచ్చరిస్తున్నారు.

## చక్కెర ఉత్పత్తి పెరిగినా ధరలు మాత్రం తగ్గలేదు

### రిజర్వు బ్యాంకు ప్రకటన

బొంబాయి, జులై 1: ఈ సంవత్సరం పంచదార ఉత్పత్తి నిరుటికంటె 2 లక్షల టన్నులు అధికమైనా, ధరలు తగ్గలేదు సరిగదా, నిరుటికంటే బాగా అధికం అయినట్లు రిజర్వు బ్యాంకువారు నేడు వెల్లడి చేశారు.

ఈవిషయాన్ని, ఈ బ్యాంకువారు, దేశంలో అన్ని బ్యాంకులకు,పంచదార తనఖా పెట్టుకుని, అప్పులు ఇవ్వడం విషయంలో అనుసరించవలసిన పద్ధతిని వివరిస్తూ, పంపిన ఆదేశంలో పేర్కొన్నారు.

ఇందులో ఈలా అన్నారు. పంచదారను ఊరికే నిల్వచేస్తూ వుండేవారికి అప్పులు ఇవ్వడం మానుకోవడమేగాక, ప్రస్తుతం ఇస్తున్న అప్పులను గూడా తగ్గించాలి. ఈమధ్య ఈ అప్పులు మహా పెరిగిపోయినాయి. జూన్ మొదటి పక్షంలో ఇవి శిఖరప్రాయం అయినాయి. ఇది ఈ తరుణంలోఅపూర్వం."

రిజర్వుబ్యాంకు, దేశంలో అన్ని బ్యాంకులను ఈ ఆదేశంలో ఇలా కోరారు. "పంచదార నిల్వల విలువకు 25%కు తగ్గనిరీతినిఅప్పులుఇస్తూవుండాలి. ప్రస్తుతం ఇస్తున్నదానికంటే ఇప్పుడు ఇంకో 10% పెంచవచ్చు; కాని అంతకు మించకూడదు. మొత్తంమీద ఇస్తున్న అప్పు, నిల్వల విలువలో 35% మించరాదు.

ఇప్పుడు దీన్ని అట్లా ఎందుకు పెంచింది వివరిస్తూ, పంచదారఉత్పత్తి ఈ సంవత్సరం నిరుటికన్నా 10% పెరిగిందని, అందుకే ఈ పెంపకం అని రిజర్వుబ్యాంకు ఉద్యోగులు తెలియజెబుతున్నారు.

ఈఅప్పులు ఇవ్వడంలో బ్యాంకులను ఇంకో అంశాన్నిగూడా పాటించవలసిందిగా రిజర్వు బ్యాంకువారు కోరుతున్నారు. 1957 జులై 26 నుంచి ప్రతివారం 10%, 10% చొప్పున పెంచుకుంటూపోవచ్చు. కాని ఆ ఇచ్చేది 1956 ఆనెలలో, అవారంలో, ఇచ్చిన దానికన్నా ఇప్పుడు 10% మాత్రమే అధికంగా వుండేట్లుచూచుకోవాలి. అప్పుడుగూడా నిల్వచేసిన పంచదార విలువలో ఇది 35% మించకూడదు.

పంచదార ధరల వ్యవహారాన్ని గూర్చి రిజర్వుబ్యాంకు అధికారుల వివరణ ఈవిధంగా వుంది: "కేంద్ర ప్రభుత్వము ఎక్సైజుసుంకాన్ని కలుపుకోకపోతే పంచదారధర మణుగు 1కి రు. 28 పడుతుంది. సుంకాన్నిగూడా కల్పుకుంటే రు 32లు అవుతుంది. నిజానికి మణుగు 1 కి రు 4 లుగా పడుతున్న ఈ సుంకాన్ని జనం భరించనవసరంలేదు. ఆపన్నును వర్తకులు ప్రజలమీదే రుద్దుతున్నారనుకున్నా,మణుగుధర రు 32లు మించేందుకులేదు. కాని ఇప్పుడు పంచదారను మణుగు 1 కి రు 35.50 లు చొప్పున అమ్ముతున్నారు.

"ధరలు ఇట్లా పెరగడం వల్ల, బ్యాంకులు ఇస్తున్న అప్పులుగూడా పెరుగుతున్నాయి. అప్పులు పెరగడంతో ధరలు పెరుగుతున్నాయి. ఇట్లా ఇది ఒక విషమ చక్రంలాగా తయారైంది. అందువల్లనే అడపా దడపా రిజర్వు బ్యాంకు కల్పించుకొని, వ్యవహారాన్ని అదుపులో పెట్టవలసి వస్తోంది.

"1955 లో పంచదార కుదువపెట్టుకొని 39, కోట్లదాకా బ్యాంకులు అప్పులు ఇచ్చాయి. 1956 లో ఇవి 45 కోట్లకు పెరిగాయి. ఈ సంవత్సరం ఇప్పటికే 60 కోట్లు దాటాయి.

### 1లక్ష69 వేలటన్నుల చక్కెర విడుదల

న్యూఢిల్లీ, జులై 1: 1లక్ష 69 వేల టన్నుల పంచదారను ప్రభుత్వం వారు అమ్మకానికి విడుదల చేశారు.

## షిల్లాంగ్‌లో భూకంపం

### మూడు గంటలలోగా మూడుసార్లు

షిల్లాంగ్, జులై 2: ఇవాళ తెల్లవారుఝామున నగరంలో మూడుసార్లు భూమి కంపించింది. మొదటి రెండుసార్లు తీవ్రంగానూ మూడవసారి కొద్దిగాను భూమి కంపించింది. శబ్దం కూడా వినిపించింది.

మొదటికంపనం అర్ధరాత్రి గం 1-5 నిమిషాలకు కొంచెం తీవ్రంగా సంభవించింది. రెండవకంపనం 80 సెకన్లలో, మొదటిదానికన్నా తీవ్రంగా సంభవించింది. ఈ రెండు కంపనాలు దాదాపు నిముషం సేపున్నాయి. కిటికీలు, తలుపులు దడదడా కొట్టుకున్నాయి. తెల్లవారుఝామున 3-40 గంటలకు మూడవసారి కంపించింది.

అస్సాంరాష్ట్రంలో ఖాసీ ప్రాంతాలలోనూ, మణిపూరు, ఈశాన్య సరిహద్దు మన్య ప్రాంతంలోకూడా భూమి కంపించినట్లు తెలిసింది.

ఆస్తినష్టం, ప్రాణనష్టం జరిగినట్లు ఇంతవరకు వార్తలేదు.

### ఢక్కాలో ఐదుసార్లు భూకంపం

కరాచి, జులై 2: అర్ధరాత్రి 1-30 గంటలవేళ భూకంపంవల్ల ఢక్కాలో ప్రజలు పక్కలమీదినుండి ఎగిరిపడ్డారు. ఇళ్ళన్నీ ఊగిసలాడాయి, అని యివాళ పాకిస్తాన్ రేడియో ప్రకటించింది.

మొదటి కంపనం 1-32 గంటల వేళ కలిగింది. ఆ తరువాత 15 సెకన్లపాటు వరుసగా నాలుగు కంపనాలు కలిగాయి. ఆస్తినష్టం, ప్రాణనష్టం ఏమీ లేదు.

## రక్షణ ఉపమంత్రిరాక

### విమానాశ్రయంవద్ద ఘనస్వాగతం

మదరాసు, జులై 2: రక్షణశాఖ ఉపమంత్రి శ్రీ కొత్త రఘురామయ్య ఇవాళ ఉదయం 10.45 లకు భారత వైమానికదళం విమానంలో విశాఖపట్నంనుంచి ఇక్కడికి వచ్చారు. తాంబరంలోని సైనిక విమానాశ్రయం వద్ద రక్షణ ఉపమంత్రికి గ్రూప్ కాప్టెన్ పి. సత్యనారాయణరావు సేనన్ కమాండర్ మేజర్ జనరల్ ఘనశ్యామసింగ్ గవర్నరు అంగరక్షకుడు స్వాగతం ఇచ్చారు.

శ్రీ రఘురామయ్య భారత వైమానికదళం ఇచ్చిన సైనికాభివందనాన్ని స్వీకరించి కేంద్రాన్ని పరిశీలించి ఉద్యోగులతో విందు ఆరగించారు.

### నగరంలో కార్యక్రమం

రక్షణశాఖ ఉపమంత్రి శ్రీ కొత్త రఘురామయ్య రేపుఉదయం 9 గంటల నుంచి 1 గంటదాకా అవడిలో సైనిక ఇంజనీరింగ్, మందుగుండు సామగ్రి విభాగాలను దర్శిస్తారు. మధ్యాహ్నం 1 గంటనుంచి 2 వరకు అక్కడ సైనికోద్యోగులతో విందు. సాయంత్రం 5-30 కు చెన్నపురి ఆంధ్రమహాసభ సత్కారం. సా॥ 6-15 కు ఆంధ్ర వాణిజ్య సంఘ సభ్యులను కలుసుకొంటారు. 4వ తేది ఉదయం విమానంలో కొచ్చిన్ వెళతారు.

## దక్షిణ ప్రాంతీయమండలి సమావేశం

న్యూఢిల్లీ, జులై 2: దక్షిణ ప్రాంతీయమండలి ప్రారంభ సమావేశం జులై 11 వ మదరాసులో జరుగుతుంది దేశీయ వ్యవహారాలమంత్రి అధ్యక్షత వహిస్తారు.

ఆంధ్ర, కేరళ, మదరాసు రాష్ట్రాలు సభ్యులుగావున్న ఈ మండలి సమావేశం కార్యనిర్వాహణ పద్ధతులు గూర్చి 1957-58 సాలుకు అభివృద్ధి ప్రణాళికలు గూర్చి చర్చిస్తారు.

# కంపెనీ నిధుల ఏర్పాటు

## మినహాయింపు మరో మూడు సంస్థలకు వర్తింపు

న్యూఢిల్లీ, జూన్ 30 : పంపిణీ కాని లాభాలలోను, తరుగు నిధులలోను, అభివృద్ధికిగాను ఆదాయపు పన్నులో ఇచ్చే మురదాలలోను కొంత భాగాన్ని ప్రభుత్వంవద్ద అన్ని కంపెనీలూ నిధిగా ఏర్పాటు చేయాలనే నిబంధన మినహాయింపును భారత ప్రభుత్వం మరో మూడు సంస్థలకు వర్తింపచేసేంది. ఇది వరలో ప్రభుత్వ సంస్థలకు, శాసన ప్రకారం ఏర్పడే సంస్థలకు, విద్యుచ్ఛక్తి సరఫరా, భీమా, బాంకింగ్ సంస్థలకు ఈ నిధుల ఏర్పాటును గురించి మినహాయింపు ఇచ్చారు. ఆర్థిక సహాయ సంస్థలకు, ప్రత్యేకంగా పాయిదాలనుగోలు విధానంలో పెట్టుబడిపెట్టే సంస్థలకు, వైమానిక, సౌకా సంస్థలకు ఇప్పుడు ఈ మినహాయింపు నిబంధనను వర్తింప చేశారు.

ఈ నిధులను మినహాయించడానికీ, ఏర్పాటు చేసిన నిధులను తిరిగి ఇవ్వడానికీ ఒక మండలిని కూడా నియమించారు. ఈ మండలిలో స్టేట్ బ్యాంకు శ్రీ పి. సి. భట్టాచార్య, రిజర్వుబ్యాంకులోని గణాంక, పరిశోధకశాఖ ప్రధాన సలహాదారు శ్రీ బి. కె. మదన్ సభ్యులు. శ్రీ భట్టాచార్య అధ్యక్షులుగా ఉంటారు.

ఈ నిబంధన ననుసరించి మండలికీ, రాబడిపన్ను కమీషనరుకు కేంద్ర ఆర్థిక శాఖ తెలియజేసింది. ఈ నిధుల ఏర్పాటుకు ఎంతమొత్తం కట్టవలసిందీ ఆయా సంస్థలే నిర్ధారణ చేసికొని నిర్ణీత తేదీలోగా చెల్లించాలి. ప్రభుత్వం ఆమోదించిన ఉద్దేశాలకు వినియోగించేందుకు గాని, అలా వినియోగించి నందుకు గాని ఈ నిధులను ఏర్పాటుకు డబ్బు చెల్లించ వలసిన పనిలేదు. ఐతే ఈ మినహాయింపు సౌకర్యాన్ని మొదటి దఫాలో ముందుగా కమీషనరు నుండిపొందాలి. ఈ మినహాయింపును అంగీకరించుటమో, లేక తన ఉద్దేశాలతో ఆ దరఖాస్తును మండలికి పంపడమో కమీషనరు చేస్తారు. దీనిపై మండలి తుది నిర్ణయం చేస్తుంది.

ఏర్పాటుచేసిన నిధులను తిరిగి పొందాలంటే, మండలికే దరఖాస్తు పెట్టాలి. ఒకసంస్థ ప్రస్తుత వ్యాపారాన్ని విస్తరింపచేసే పెట్టుబడి ఖర్చులను, సంస్థ ఆస్తులపై తెచ్చిన ఋణాలను చెల్లించేందుకు ప్రభుత్వం గుర్తించింది. ఈ ఉద్దేశాలతో ఖర్చుచేస్తే, ప్రభుత్వం ఏర్పాటుచేసే నిధినిబంధనను తప్పక మినహాయిస్తారు.

పరిశ్రమలకు అవసరమైన ముడి పదార్థాలు మొదలైనవస్తువులు తగినంత నిల్వ ఉంచుకోవడం, పారిశ్రామికాభివృద్ధి చట్టం ప్రకారం పెట్టే పరిశ్రమలలో తను పెట్టుబడి మొదలైన వాటిని కూడా ప్రభుత్వం గుర్తిస్తుంది. పోతే, ధరలలో జూదానికీ, గుత్త వ్యాపారం ఏర్పాటుకు నిధులను వినియోగించడం, అవసరవస్తువులు కాని వాటి ఉత్పత్తి మొదలైనవాటిలో పెట్టే పెట్టుబడులకు ఎలాంటి మినహాయింపూ ఉండదు.

ఈ నిధులరూపంలో ప్రభుత్వంవద్ద ఉంచే సొమ్ముకు 1957-58 వ సంవత్సరానికి నూటికి మూడున్నర రూపాయలు వడ్డీ ఇస్తారు.

ఈ మండలి కార్యాలయం బొంబాయిలో క్వీన్స్ రోడ్ లోని ఆయకార భవనంలో ఏర్పాటు చేస్తున్నారు.

# నర్సాపురం పట్టణ కాంగ్రెసు రాజీనామా

## పురపాలక ప్రత్యేకోద్యోగి బదిలీకి నిరసనగా

నర్సాపురం, జూలై 1: పురపాలక సంఘ ప్రత్యేకోద్యోగిని బదిలీ చేసినందుకు నిరసనగా పట్టణ కాంగ్రెసు సంఘం నేడే రాజీనామా చేసింది. త్వరలో ఎన్నికలుకూడా జరుగనున్నందున యీ బదిలీ ప్రజలకుగాని పురపాలకులకుగాని లాభదాయకం గాదని కాంగ్రెసు సంఘం తీర్మానించింది. ఈ బదిలీలో కులమత తత్వాలు పనిచేసి వుండవచ్చని అభిప్రాయపడింది. ప్రజా సంస్థలు, పట్టణ కాంగ్రెసు జరిపిన ఆందోళనను లెక్క చేయనందుకు విచారం వెలిబుచ్చింది.

తీర్మానాల ప్రతులను ముఖ్యమంత్రికీ, స్వపరిపాలనాశాఖామంత్రికీ, ఆంధ్రకాంగ్రెసు అధ్యక్షునికి పంపారు. (స్వ. వి.)

# ఖమ్మం తాలూకాలో స్ఫోటకం వ్యాధి

ఖమ్మంమెట్టు, జూన్ 28 : "ఖమ్మం తాలూకా లాలాపురం" ప్రాంతంలో స్ఫోటకవ్యాధి ఉధృతంగా వున్నట్లు సమాచారం అందింది. అక్కడ యీ వ్యాధివల్ల యిప్పటికి నాలుగు మరణాలు సంభవించినవనీ. ప్రజారోగ్యశాఖ యీ విషయం అంతగా పట్టించుకోవడం లేదనీ తెలుస్తున్నది. వ్యాధి సోకిన నాలుగైదు దినాలకు, శరీరం అంతా పగిలిపోవడం యీ వ్యాధిలో ఒక ప్రత్యేక లక్షణంగా చెప్పుకుంటున్నారు.

ఒక వైపున శీతజ్వరాలబాధ, మరో వైపు స్ఫోటకవ్యాధి; అందులో వ్యవసాయం ప్రారంభించి, ముమ్మరంగా పని జరుగుతునే తరుణం. ముఖ్యంగా రైతులు అవస్థలకు గురికావడం జరుగుతున్నది. (స్వ. వి.)



ఓస్లోలో శ్రీ నెహ్రూ ఒక పాఠశాలకు వెళ్ళినప్పుడు, విద్యార్థినులు స్వాగతమిస్తున్నారు.



భారత పత్రికా సంపాదకుల బృందం మే 27 న ఐక్యరాజ్యసమితి కేంద్ర కార్యాలయాన్ని దర్శించి కార్యదర్శి శ్రీ డాగ్ హామర్ షెల్డును కలుసుకున్నారు. ఇందులో ఎడమనుండి కుడికి శ్రీ డి. ఆర్. మంకేకర్ (టైమ్స్ ఆఫ్ ఇండియా) శ్రీ సి. ఆర్. శ్రీనివాసన్ (స్వదేశమిత్రన్) ఐక్యరాజ్యసమితి కార్యదర్శి (హామర్ షెల్డు) శ్రీ తుషార్ కాంతిఘోష్ (అమృతబజార్ పత్రిక) శ్రీ కే. శ్రీనివాసన్ (హిందూ) శ్రీ వి. ముఖర్జీ (జుగంతర్) సంపాదకులున్నారు.

# తపాలా బహుమతి పత్రాల పథకం

## పంత్‌చే ప్రారంభోత్సవం

న్యూఢిల్లీ, జూలై 1: జాతీయ పొదుపు ఉద్యమాన్ని ప్రోత్సహించే ఉద్దేశ్యంతో ప్రభుత్వం ఆరంభించిన తపాలా బహుమతి పత్రాల పథకానికి దేశీయాంగ మంత్రి పండిత గోవింద వల్లభ పంత్ యివాళ ప్రారంభోత్సవం జరిపారు. ఇక్కడి కేంద్ర తపాలా కార్యాలయంలో యీ ఉత్సవం జరిగింది.

ఈ సమయంలో పండిత పంత్, రు 110 విలువగల బహుమతి పత్రాలను కొన్నారు. తంతి తపాలాశాఖ మంత్రి శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి, తపాలా గుమాస్తాగా వ్యవహరించారు. ఈ శాఖా సహాయమంత్రి శ్రీ హుమాయూన్ కబీర్ తదితర ప్రముఖులు ఈ ఉత్సవంలో పాల్గొన్నారు.

వివాహాలు, జన్మ దినోత్సవాల్లాంటి శుభ సమయాల్లో చదివించే కట్నాలు, కానుకలకు బదులుగా ఈ బహుమతి పత్రాల పథకాన్ని రూపొందించారు. వీటని ప్రణాళిక పొదుపు పత్రాలకు మార్చుకో వచ్చును.

ధనవంతులు, వీరికంటె ముఖ్యంగా పేదవారు, వివిధ రీతులలో చేసే ధన సహాయంపై రెండవ ప్రణాళిక విజయం ఆధారపడి ఉన్నదని యీ పథకాన్ని ప్రారంభిస్తూ పండిత పంత్ అన్నారు.

ఋణాలు తదితర చిన్న చిన్న పొదుపు మొత్తాల ద్వారా చాలా వరకు అభివృద్ధి సాధించవచ్చునని తపాలా మంత్రి శ్రీ లాల్‌బహదూర్ శాస్త్రి తెలియజేశారు.

# తపాలా ఉద్యోగుల స్థితి

## విచారణకు ప్రత్యేకోద్యోగి నియామకం

మదరాసు, జూలై 1: తంతి, తపాలా శాఖకు చెందిన తపాలా ఉద్యోగుల పరిస్థితులను గూర్చి విచారించటానికి కేంద్రప్రభుత్వం అనుభవం గల్గిన ఒక ఉద్యోగిని నియమించబోతోంది.

ఈ విషయాన్ని నిన్న సాయంత్రం మెమోరియల్ హాల్లో జరుగుతున్న అఖిలభారత తపాలా (శాఖకు చెందని) ఉద్యోగుల సభలో తంతి తపాలా మంత్రి శ్రీ రాజ్ బహదూర్ వెల్లడించారు. సమావేశానికి లోక్ సభ సభ్యుడు శ్రీ కే. ఆర్. సంబంధం అధ్యక్షత వహించారు. ఆహ్వాన సంఘాధ్యక్షుడు శ్రీ యస్. ముత్తుకుమారస్వామి స్వాగతం ఇచ్చారు.

# తగాదాలు సామ్యంగా పరిష్కరించుకోవాలి

## కార్మికులకు యజమానులకు కేంద్రమంత్రి నందా హితవు

కలకత్తా, జూన్ 30 : న్యాయస్థానాలకు వెళ్ళకుండా ప్రభుత్వంతో ప్రమేయం లేకుండా, కార్మికులు మిల్లుల యజమానులు తమ సమస్యలను పరస్పరం చర్చించుకొని పరిష్కరించుకోవాలని, కేంద్రప్రభుత్వ కార్మిక, ప్రణాళిక శాఖల మంత్రి శ్రీ గుల్జారీలాల్ నందా సలహా ఇచ్చారు.

మిల్లుల యజమానులు అన్ని సమస్యలను నూతన దృక్పథంతో, దేశ శ్రేయస్సుకు అనుగుణంగా పరిశీలించ వలసిన సమయం ఆసన్నమైందని కార్మికులపట్ల, సంఘంపట్ల, దేశంపట్ల, యజమానులు తమ బాధ్యతలను గుర్తెరగాలని, అనుక్షణం మారిపోతున్న పరిస్థితులకు తగినట్లుగా తమ్ము తాము సరిదిద్దుకోక పోతే వెనుకబడిపోతారని ఆయన హెచ్చరించారు.

అదే విధంగా కార్మికులు కూడా, దేశక్షేమాన్ని దృష్టిలో పెట్టుకొని తమ సమస్యలను పరిశీలించాలని సలహా ఇచ్చారు. శ్రీ నందా ఇక్కడికి 15 మైళ్ళలోని సీరాంపూరులో వస్త్ర పరిశ్రమ కార్మికుల సమావేశంలో ప్రసంగిస్తూ, "మిగతా అన్ని వర్గాల ప్రజల మాదిరేమీ శ్రేయస్సు కూడా, అభివృద్ధిపైన, జాతీయ ఆర్థిక వ్యవస్థ బలపడడం పైనా ఆధారపడి ఉంది. దేశం పెద్ద మార్పులకు లోనవుతున్నదన్న సంగతి గ్రహించాలి. ఇంకా పాత పద్ధతులలోనే ఆలోచించడం తగదు. కేవలం మీ సమస్యలనే గాకుండా మొత్తం దేశశ్రేయస్సు కోసం ద్వితీయ పంచవర్ష ప్రణాళికను జయప్రదం చేయడానికి విధిగా మీరు కృషి చేయాలి." అని విజ్ఞప్తి చేశారు.

### కార్మిక సంఘాల కర్తవ్యం

"కార్మిక సంఘాలు, యీ విషయంలో ప్రధానమైన పాత్ర నిర్వహించాల్సి ఉంది. కేవలం సాధక బాధకాలను వ్యక్తం చేయడంగాదు, వివాదాలతో కార్మికులను లోబరుచుకొని నడిపించడం గాదు. ద్వితీయ ప్రణాళిక కాలంలో దేశ ఆర్థిక వ్యవస్థా నిర్మాణంలో తాము ఎంత ప్రధానమైన భూమిక నిర్వహించాల్సి ఉన్నదీ. కార్మికులు గ్రహించేట్లు చేయాలి" అని హెచ్చరించారు.

### బలం సంపాదించాలి

కార్మిక సంఘాలు బలంగా ఉండాలని, తమ లక్ష్యాలు సాధించుకోగలగాలంటే యిదొక్కటే మార్గమని చెబుతూ యీవిధంగా సలహా యిచ్చారు. "నా మటుకు నేను కార్మికసంఘంలోవాళ్ళే అవడంచేత కొన్ని కార్మిక సంఘాలు దుర్బలంగా ఉండడంచూస్తే నాకు బాధ కలుగుతుంది. తమ వ్యవస్థలను బలంగా నిర్మించుకొనేబదులు, అవి అంత ప్రధానంకానివిషయాలపై తమ శక్తి వృథా చేసి వేసుకొంటున్నాయి. ఏదో త్రవ్వి తలకెత్తుతాం అని ఉత్త వాగ్దానాలుచేసి కార్మికులను ఆకర్షించే కార్మిక సంఘాలు, కార్మికుల మంచి కోసం కృషిచేయవు. కార్మిక సంఘము నేడు నిర్దుష్టమైన సిద్ధాంతాలపై, దేశాభ్యుదయానికి, సమాజక్షేమానికి దోహదంఇచ్చే స్పష్టమైన లక్ష్యాలను దృష్టిలో పెట్టుకొని పనిచేయాలి".

### ఎవరూ నిరుద్యోగి కారాదు

పరిశ్రమలలో దుబారా లేకుండా ఉత్పత్తిని క్రమబద్ధంగా చేయడం విషయం ప్రస్తావిస్తూ, "ఇందువల్ల ఇప్పటి కార్మికులను పనినుండి తొలగిస్తారనికాదు. ఒక్క కార్మికుడుకూడా నిరుద్యోగి కాకూడదనే నా అభిమతం" అన్నారు.

ఉదయం శ్రీ నందా, కార్మికశాఖ ఉపమంత్రి శ్రీ ఆబీదాలీ కలిసి కార్మిక సంఘాల కోర్కెలను సాధక బాధకాలను విన్నారు.

కార్మికులసభలో శ్రీ నందా ప్రసంగిస్తూ, కలకత్తా రేవులో రద్దీ సంగతి చెప్పారు. కార్మికులు పని తేమలకుండా సుందరంగా సాగించాలని వేసే ఎత్తులవల్ల ప్రయోజనం ఉండదని, అధికారులను వత్తిడిచేసి తమ కోర్కెలను సాధించుకోగలమన్న భావంతో వుండరాదని, అటువంటి పద్ధతులవల్ల ప్రజల సానుభూతి కోల్పోతారని సలహా యిచ్చారు.

# లఘు పరిశ్రమలకు సహాయం

## రేణిగుంటలో గాజు పూసల టోకుదుకాణం

న్యూఢిల్లీ, జూన్ 30 : లఘుపరిశ్రమల వస్తువుల అమ్మకంలో 1956-57 లో జాతీయ లఘుపారిశ్రామిక సహాయసంస్థ తగు సహాయం చేసింది. వివిధప్రాంతాలలోని గ్రామ, పట్టణాలలో ఈవస్తువుల అమ్మకానికి తొమ్మిది సంచార శకటాలను ఏర్పాటుచేశారు. వీరు గృహోపకరణ సామగ్రిని, వస్త్రాలను, ఆటవస్తువులను, ఆహారధాన్యాలను, చిన్న ఇంజనీరింగ్ వస్తువులను మొదలైన వాటిని అమ్మారు. ఈ శకటాలలో వల్లి, కత్తెరలు, ఆగ్రా పాదరక్షలు, ఖుర్జా మృణ్మయపాత్రలు మొదలైన వాటికి గిరాకీకి గల అవకాశాలను పరిశీలించారు. పాదరక్షలకు ఆగ్రాలోను, మృణ్మయ పాత్రలకు ఖుర్జాలోను, తాళాలకు అలీఘర్‌లోను, గృహాలంకరణకు పనికివచ్చే నూలు వస్త్రాలకు కలకత్తాలోను, రంగులకు బొంబాయిలోను, గాజుపూసలకు రేణిగుంటలోను టోకు దుకాణాలను ఏర్పాటుచేసినట్లు ఈసంస్థ వార్షిక నివేదికలో పేర్కొన్నారు. 1956 అక్టోబరులో రష్యాకు మూడు లక్షల జతల కొలిహాపురి చెప్పులు ఈ సంస్థ సరఫరా ప్రభుత్వ వ్యాపార సంస్థద్వారా ఏర్పాటు చేశారు. 57 మార్చి ఆఖరు నాటికి వివిధ కేంద్రాలలోను 120 వేల జతల జోళ్లు తయారయ్యాయి. ఈ సంస్థ ఆధ్వర్యంలో ఒక ప్రభుత్వ కొనుగోలు శాఖనుకూడా ఏర్పాటు చేశారు. తాళాలు, పెట్టెలు, లోహపు బొత్తాలు, తోలుపటకాలు, బూట్లు, సాధారణ జోళ్లు, తోలుసంచీలు, తోలుపెట్టెలు, మొదలైన పదహారు వస్తువులను కేవలం లఘుపరిశ్రమల నుండి పొందాలని సరఫరాశాఖ డైరెక్టర్ జనరల్‌తో సంప్రదించి, నిర్ణయించడం జరిగింది. వాయిదా చెల్లింపుపై చిన్నయంత్రాల సరఫరాకు కృషి జరుగుతోంది. 57 మార్చి నెలాఖరు నాటికి 262 లక్షల రూపాయల ఖరీదు చేసే 4100 యంత్రాలకోసం 984 దరఖాస్తులు వచ్చాయి.

జాతీయాభివృద్ధి కేంద్ర ప్రాంతాలలోనితక్కువ ఆదాయకుటుంబాలలోని స్త్రీలకు కుట్టు మిషనులను వాయిదా కొనగోలుపై సరఫరా చేస్తున్నారు. పైలట్ ప్రాజక్టు ప్రాంతాలలో కుట్టు పనిలో శిక్షణపొందిన యువకులకు కూడా ఈ పథకాన్ని వర్తింపచేశారు. మొత్తం రెండువేల మిషనులకు దరఖాస్తులు వచ్చాయి. సంవత్సరం ఆఖరుకు 300 మిషనులను సరఫరా చేశారు.

అలహాబాదులో 28 ఎకరాల భూమిని సంపాదించి. 34 కర్మాగారాలను నెలకొల్పడానికి 24 మందిఉత్పత్తిదారులకు అవకాశం ఇస్తున్నారు. వచ్చే ఆగస్టు 15 నాటికి ఈ కర్మాగారాల నిర్మాణం పూర్తి ఔతుంది

బొంబాయి, కలకత్తా, ఢిల్లీ, మద్రాసు నగరాలలో నాలుగు ఉపసంస్థలను ఏర్పాటు చేశారు.

# తోటల పరిశ్రమలో మేనేజింగుఏజన్సీలు

## రద్దుకు ప్రభుత్వం విముఖత

న్యూఢిల్లీ, జూలై 1: తోటల పరిశ్రమలో మేనేజింగ్ ఏజన్సీ పద్ధతిని రద్దుచెయ్యడానికి ప్రభుత్వం తిరస్కరించింది.

తోటల పరిశీలన సంఘం వారు, ఈ సూచనతోపాటు, డివిడెండ్ల పంపకానికి నిధులను ఉపయోగించరాదని, ఎగుమతి కోటాల పద్ధతిని తీసివెయ్యాలని సూచించారు. ఈ రెండు సూచనలను కూడా ప్రభుత్వం తిరస్కరించింది.

తేయాకు బోర్డు వారు దేశంలో విడి అమ్మకాలకు కూడా పూనుకోవాలని, నూటికి 50 వంతుల వ్యాపారం ఈ బోర్డు ద్వారా జరగాలని కూడా ఈ సంఘం వారు సూచించారు. ఈ సూచనను కూడా ప్రభుత్వం తిరస్కరించింది.

1956 ఆగస్టు 28 న కేంద్ర ప్రభుత్వం ఈ సంఘాన్ని నియమించి, కాఫీ, తేయాకు, రబ్బరు తోటల వ్యవహారాలను పరిశీలించాలని కోరింది.

వీరు చేసిన సూచనలలో తేయాకు ధరలను పరిశీలన చేయించాలన్న సూచనను ప్రభుత్వం ఆమోదించింది.

# ఆనందస్వామి బహిష్కారం

జలంధర్, జూన్ 30: ఆర్యసమాజ్ నడుపుతున్న హిందీ రక్షా ఉద్యమాన్ని ప్రస్తుతం నిలిపివేయాలని చెప్పినందుకు మహాత్మ ఆనందస్వామిని హిందీ రక్షా సమితి, సమితినుండి బహిష్కరించింది.

రాష్ట్రంలో యీ ఉద్యమాన్ని యింకా సాగించాలని తీర్మానిస్తూ, దీన్ని జయప్రదం చెయ్యడానికి హిందీ అభిమానులు ఎటువంటి త్యాగాలకైనా సిద్ధంగా ఉండాలని సమితి హెచ్చరించింది.

ఇవాళ సమితి సమావేశంలో ఆనందస్వామిని వెళ్లగొట్టాలని ఏకగ్రీవంగా చేసిన తీర్మానంలో, ఆనందస్వామి ప్రకటన సమితికి గట్టిదెబ్బ అని పేర్కొన్నారు.

మతానికి సంబంధం లేకుండా శాంతియుత పద్ధతులలోనే ఉద్యమాన్ని నడపాలని కార్యకర్తలను హెచ్చరించింది.

# నూలు ఎగుమతి

## తగినంత నిలవ లేదని షా ప్రకటన

కోయంబత్తూరు, జూన్ 30 : ఎగుమతి చెయ్యదగినంత నూలు భారతదేశంలో లేదని కేంద్ర భారీ పరిశ్రమల మంత్రి శ్రీ యమ్. యమ్. షా దక్షిణాత్య మిల్లు యజమానులు సమర్పించిన విజ్ఞప్తి పత్రానికి సమాధానంగా తెలియజేశారు.

నూలు ఎగుమతులు ధారాళంగా జరిగేటట్లు ప్రభుత్వం చర్యలు తీసుకొన్నట్లయితే, మిల్లులలో గుట్టలుగా పడివుంటున్న నూలు నిలవలు తరిగిపోవడంతో పాటు తమ ఉత్పత్తులకు గిట్టుబాటుగా వుండేధరలను రాబట్టుకోవటానికివీలుంటుందని మిల్లు యజమానులు తమ విజ్ఞప్తి పత్రంలో పేర్కొన్నారు.

మంత్రి దీనికి జవాబుచెప్తూ, నిలవవున్న నూలు స్వల్పమేననీ, నూలు ఎగుమతులను యిప్పుడు అనుమతించటం ద్వారా, విదేశీద్రవ్యాన్ని సంపాదించాలన్న అభిప్రాయం ప్రభుత్వానికి లేదనీ అన్నారు.

నూలు ఎగుమతులకు విదేశీ విపణులను స్థాపించుకోవటంలో, మిల్లులకు తగు స్వేచ్ఛ యివ్వటం లేదని యజమానులు తెలియజేశారు. "నూలువడుకు పరిశ్రమ అభివృద్ధి పొంది బాగా విస్తరించింది. వెనుకటికంటె నూటికి 20 వంతులు అధికంగా యిప్పుడు నూలు వుత్పత్తి అవుతున్నది. దీనితోపాటు చేనేత, తదితర కుటీర పరిశ్రమలలో నూలు వాడకం గూడా వృద్ధి అయింది. ఈ పరిస్థితులవల్ల, నూలు నిలవలు క్రమంగా పెరిగిపోతున్నాయి. కాబట్టి ఒక దీర్ఘకాలిక పథకాన్ని రూపొందించటం ద్వారా ఈ పరిశ్రమ, నూలు ఎగుమతికి నిశ్చితమైన విపణులను నెలకొల్పుకొనేందుకు ప్రభుత్వం అనుమతించాలి" అని వీరు మంత్రినికోరారు.

## నూలు వినియోగానికి ఆంధ్రమద్రాసుసమిష్టికృషి

చేనేత పరిశ్రమలో అగ్రగాములైన ఆంధ్ర, మద్రాసు రాష్ట్రాలు, సమిష్టిగా కృషిచేసి నూలు వినియోగానికి మార్గాలను అన్వేషించాలని శ్రీ షా సూచించారు.

# బొగ్గు కార్మికుల బకాయి వేతనాలు

## కేంద్ర కార్మికమంత్రి నందా సలహా

కలకత్తా, జూలై 1: బొగ్గుగని కార్మికుల వేతనాల విషయం విచారించి న్యాయస్థానం యిచ్చిన తీర్పుప్రకారం బకాయి వేతనాల క్రింద తమకు వచ్చే డబ్బులో కొంత యథేచ్ఛగా జాతీయ పొదుపు పత్రాలను కొనడానికి ఉపయోగించి ప్రభుత్వానికి పెట్టుబడి పెట్టాలని, కేంద్ర కార్మికమంత్రి శ్రీ గుల్జారీలాల్ నందా బొగ్గు కార్మికులకు సలహా ఇచ్చారు.

బొగ్గు కార్మికులకు ఎక్కువచేసిన వేతనాల చెల్లింపు విషయం జూన్ 26 న ఢిల్లీ కార్మిక ప్రతినిధులను, బొగ్గు పరిశ్రమల ప్రతినిధులను సమావేశపరచి శ్రీ నందా చర్చించారు. నిన్న కలకత్తాలో యీ ఉభయ ప్రతినిధుల సమావేశం కూడా యిందుకే జరిగింది. కార్మిక శాఖ ఉపమంత్రి శ్రీ ఆబీదాలీ కూడా హాజరైనారు.

కార్మికులు తమకు బకాయీలక్రింద రావలసిన వేతనాలను జాతీయ పొదుపు పత్రాలలో పెట్టుబడి పెట్టాలని అన్ని పార్టీలూ విజ్ఞప్తి చేయడం మంచిదని శ్రీ నందా సూచించారు. ఈ బకాయి వేతనాలలో కొంత సహకార పరపతిసంఘాలలో వాటాలు కొనేందుకు వినియోగించవచ్చని కూడా ఆయన సూచించారు.

ఈ సూచనలను పరిశీలించడానికి కొంత వ్యవధి ఇప్పించాలని ఉభయ పక్షాల ప్రతినిధులు కోరారు.

# సౌదీ సిరియాల సంబంధాలు

## బాగు పడతాయని సిరియాప్రధాని ఆశ

డమాస్కస్, జూలై 1: సౌదీ అరేబియా సిరియా ప్రభుత్వాల సంబంధాలు బాగుపడి మళ్ళీ యథా స్థాయికి వస్తాయని, సిరియా ప్రధానమంత్రి శ్రీ అస్సాలీ నిన్న, మంత్రివర్గ సమావేశానంతరం చెప్పారు.

జెడ్డాలోని సిరియన్ ప్రతినిధి తెలిపిన సమాచారాన్ని, యిటీవల సిరియా సౌదీ నాయకుల చర్చలను దృష్టిలో పెట్టుకుని అరబ్ విధానాన్ని పునర్విమర్శించామని ఆయన అన్నారు.

ఐసెన్‌హోవర్ పశ్చిమాసియా పథకాన్ని ఆమోదించడంగాని, మరో విదేశీ రాజ్యాలతో మైత్రి పెట్టుకోవడం గాని తాను ఎన్నడూ చేయనుఅని సౌదీ అరేబియా రాజు చెప్పినట్లు జెడ్డాలోని సిరియన్ ప్రతినిధి ముఫాక్ అలీ తెలియజేశాడు.

అరబ్‌ల విముక్తికోసం కృషిచేయాలి అని కైరో సమావేశంలో నిర్ణయించిన విధానానికే కట్టుబడి వుంటానని, అకాబా సింధుశాఖ విషయంలో తాను ఏదో కొత్తవైఖరిని అవలంబించినట్లు పుట్టిన పుకార్లలో నిజం లేదని సౌదీరాజు చెప్పాడట.

# సాహసంగల న్యాయవాది

## ప్రకాశంగారికి ప్రధాన న్యాయమూర్తి జోహార్లు

మదరాసు, జూలై 2 : వేసవి శెలవుల అనంతరం నిన్న ప్రధాన న్యాయస్థానం తెరవగానే ప్రధాన న్యాయమూర్తి శ్రీ రాజమన్నార్, న్యా॥ ఎ. యస్. పంచాపకేశ అయ్యరుల ముందు శ్రీ ప్రకాశం పంతులుగారి మరణ ప్రస్తావన వచ్చింది.

అడ్వొకేటు జనరలు శ్రీ వి. కె. తిరువెంకటాచారి శ్రీ ప్రకాశంగూర్చి ప్రస్తావిస్తూ "పంతులుగారు న్యాయవాది. 1893 లో న్యాయశాస్త్రకళాశాలలో చేరారు. రాజమహేంద్రవరంలో న్యాయవాద వృత్తి ప్రారంభించారు. అక్కడనుంచి ఇంగ్లండువెళ్లి బారిష్టరు అయ్యారు. 1907 లో మద్రాసులో వృత్తి మొదలుపెట్టారు. 1919 లో మహాత్మగాంధీ ప్రబోధానికి లోనై వృత్తి మానేశారు. తరువాత మళ్ళా 1935లో వృత్తిని ప్రారంభించి రెండేళ్లు చేసిమానేశారు. 1939లో కొంతకాలం మరల వృత్తిని అవలంబించారు. పెద్ద ప్రాక్టీసు వుండేది. వారికి గట్టి న్యాయవాదని, ధైర్యంగల న్యాయవాది యని పేరువుండేది. రాజకీయాల్లో మంచిపేరు పొందారు. దేశంలో పేరునిలబెట్టుకున్నారు. ఆంధ్రులు ఆయనను ఆంధ్రకేసరి అన్నా నిజానికి ఆయన భారతకేసరే. స్వార్థత్యాగి. గొప్పదేశ భక్తుడు" అని చెప్పారు.

ప్రధాన న్యాయమూర్తి మాట్లాడుతూ ఇల్లా అన్నారు: "ఆ దేశం రాకుండా పంతులుగారినిగూర్చి మాట్లాడలేను. కారణం ఆయన మా కుటుంబ స్నేహితుడు, శ్రేయోభిలాషి. న్యాయవాదిగా ఆయన నా మనస్సులో మెరుపులతో వున్నారు. మీ రన్నట్లు స్వార్థంలేని దేశభక్తులలో ప్రకాశంగారొకరు. స్వాతంత్ర్య పోరాటంలో ఆయనపాత్ర ఒక చరిత్రే. ప్రకాశం గొప్ప న్యాయవాది అనే విషయాన్ని మరచిపోకూడదు. అది మహామహుల యుగం. ధైర్యసాహసాలకు ఆయనతో సరిపోల్చగలవారు బహుకొద్దిమంది వుంటారు. ప్రకాశంగారు ఎప్పుడూ న్యాయవాదుల హక్కులు గూర్చి పోరాడేవారు. ఆయనగుణాల్లో ప్రధానమైంది ధైర్యం, సాహసమే. ఆయనకు ఆంధ్రకేసరి బిరుదు సార్థకనామం. ప్రకాశం ఆంధ్రులకు నాయకుడేగాక ఒక జాతీయసంస్థ; రాబోవు తరాలవారికి మార్గదర్శి. అని చెప్పి,అడ్వొకేటు జనరలు చేసిన ప్రశంసావాక్యాలతో ఏకీభవిస్తున్నామనీ తమ తరపున సోదర న్యాయమూర్తుల తరఫున సానుభూతిని ప్రకాశంగారి కుటుంబానికి తెలుపవలసిందని కోరారు.

# 'కరువుభత్యం పెంచకపోతే జీతాలు వద్దు'

## ఉస్మానియా విశ్వవిద్యాలయంఉద్యోగులఆక్షేపణ

హైదరాబాదు, జూలై 1: కరువు భత్యం ఎక్కువచేయనందుకు నిరసనగా, ఉస్మానియా విశ్వవిద్యాలయంలో పని చేసే ఉద్యోగులూ, ఆ విశ్వవిద్యాలయానికి అనుబంధములయిన ఆరు కళాశాలల్లోని ఉద్యోగులూ మొత్తం 2500 మంది జీతాలు తీసుకోలేదని విశ్వవిద్యాలయం మజ్దూర్ సంఘం ప్రధాన కార్యదర్శి శ్రీ టి. గోవిందసింగ్ చెప్పారు. నెలకు రు. 100 - అంతకు లోపు వేతనాల ఉద్యోగులకు ప్రభుత్వం మంజూరుచేసిన రు. 5 అదనపు కరువుభత్యాన్ని తమకు కూడా ఇవ్వాలని ఈ ఉద్యోగులు కోరుతున్నారు. ఉస్మానియా విశ్వవిద్యాలయానికిచెందిన అన్నిరకాల ఉద్యోగులు ఆక్షేపణ తెలియచేసినవారిలో ఉన్నారనికూడా శ్రీ సింగ్ తెలియ చేశారు.

## గంటల పంచాంగం

శ్రీ హేవిళంబి సం॥ ఆషాఢ శు॥ షష్ఠి 1957 సం॥ జూలై 3 బుధవారం శు॥ షష్ఠి 3-51 ఉత్తర రా 2-19 వర్జ్యం 10-35 ల 12-5 వు.

శు॥ సప్తమి జూలై 4 గురువారం శు॥ సప్తమి 6-37 అష్టమి రా 4-4 ఉ-హస్త రా 1-11 వర్జ్యం 10-19 ల 11-51 వు.

ఆంధ్రపత్రిక

(మహాభారతము)

హేవిళంబి సం॥ ఆషాఢ శు॥ షష్ఠి బుధవారం

## ధరల అదుపుకు రిజర్వు బ్యాంకు చర్యలు

ఆహార ధాన్యాల ధరల పెరుగుదలను నిరోధించి ఒక ప్రమాణంలో ధరలను నిలిపి వుంచడానికి కేంద్ర ప్రభుత్వం అనేక చర్యలు తీసుకున్నది. ఈ చర్యలు ఫలిస్తున్నవని, ఆహార ధాన్యాల ధరలు తిరిగి తగ్గుతున్నవని అధికారులు ప్రకటించారు. అయినా రిజర్వుబ్యాంకు కూడా ఆహార ధాన్యాల ధరలను అదుపులో వుంచడానికి కొన్ని చర్యలు తీసుకోవలసి వచ్చినది. ఆహారధాన్యాల నిల్వలపై ఎక్కువగా అప్పులు ఇవ్వవద్దని రిజర్వుబ్యాంకు ఇతర బ్యాంకులను ఆదేశించినది. పరపతి సౌకర్యాలు పరిమితం కావడంవల్ల వ్యాపారస్థులు సరుకును విధిగా విడుదల చేయవలసి వుంటుంది. ఎవళ్ళు లాభాలను సంపాదించాలని వర్తకులు ధాన్యాన్ని నిలవచేసి వుంచడం వల్ల ధరలు పెరిగినవని ప్రభుత్వ నమ్మకం. కనుక వర్తకులు ధాన్యాన్ని నిల్వచేయడానికి వీలులేకుండా చేస్తే ధరలు తగ్గక తప్పదని అధికారులు భావించారు.

బ్యాంకులు పరపతి సౌకర్యాలను పరిమితంచేసి, ఆహార ధాన్యాలపై అప్పులు ఇవ్వడం మానివేస్తే, వర్తకులతోబాటు రైతులు కూడా ఇబ్బంది పడవలసి వుంటుంది. ఏ కొద్దిమందో తప్ప వర్తకులు రైతులవద్ద కొన్న ధాన్యానికి పూర్తిగా డబ్బు చెల్లించరు. సరుకు విడుదలై వారికి డబ్బు పూర్తిగా వచ్చినతరువాతనే రైతులకు పూర్తిగా డబ్బు చెల్లించడం జరుగుచున్నది. బ్యాంకులు అప్పులు ఇవ్వడం మానినందువల్ల వర్తకులు అంతగా నష్టపడరు. కాని రైతులకు మాత్రం విక్రయించిన ధాన్యానికి డబ్బు చేతికిరాదు. ధాన్యం అమ్మిన డబ్బుతో తీర్చివేయవచ్చుననే ఆశతో రైతులు కొంత ఎక్కువ వడ్డీకి కూడా అప్పులు చేయడం జరుగుచున్నది. రిజర్వు బ్యాంకు గ్రామీణ పరపతి సౌకర్యాలనుగురించి జరిపిన విచారణలో రైతులు వడ్డీ వ్యాపారస్థుల మీదనే ఎక్కువగా ఆధారపడి వుంటున్నట్లు వెల్లడి అయింది. జాతీయాదాయంలో ఇంచుమించు సగం వ్యవసాయంనుంచే లభిస్తున్నది. 4,780 కోట్ల రూపాయలను ఆర్జిస్తున్న వ్యవసాయానికి ప్రభుత్వం ఇచ్చే రక్షణాగాని, కల్పిస్తున్న సౌకర్యాలుగాని అంతగా లేవని గ్రామీణ పరపతి సౌకర్యాలను గురించిన రిజర్వుబ్యాంకు విచారణ నిరూపించినది. రైతుల ఋణంలో ప్రభుత్వము, సహకార సంఘాలు పదహారోవంతు మాత్రమే ఇస్తున్నవి. మామూలు వడ్డీ వ్యాపారస్థుల నుంచి, సాటి రైతులనుంచే రైతులు ఎక్కువగా ఋణసహాయాన్ని పొందుతూ వున్నారు. ప్రభుత్వం ఇచ్చే ఋణాల్లో కూడా మూడింట ముప్పాయి వంతు రైతులే ఎక్కువగా పొందుతున్నారు. సామాన్య రైతులకు ప్రభుత్వంగాని, సహకార సంఘాలుగాని ఏమీ సహాయం చేయడంలేదు.

ఈ పరిస్థితులలో ఆహార ధాన్యాలపై బ్యాంకులు అప్పులివ్వరాదని రిజర్వు బ్యాంకు ఆదేశించడంవల్ల సామాన్య రైతులు పూర్తిగా వర్తకుల, వడ్డీ వ్యాపారుల దయ, దాక్షిణ్యాలపై ఆధారపడి వుండవలసి వస్తున్నది.

ధరల పెరుగుదలను నిరోధించడం అవసరమే. కాని ధాన్యాలకు "న్యాయమైన ధర" ను నిర్ణయించనప్పుడు "ధరలు పెరుగుతూ వున్నవి" అని నిర్ణయించి, ఆ పెరుగుదలను నిరోధించడానికి చర్యలు తీసుకోవడం సబబుగా కన్పించదు. ధరలను అదుపులో వుంచడానికి ఏ చర్యలు తీసుకున్నా, పంటదారులకు నష్టం కలగకుండా చూచుకోవలసిన బాధ్యత ప్రభుత్వానిదే. పంటదారులకు సరియైన పరపతి సౌకర్యాలు లేవు. అందువల్ల వ్యవసాయ ఖర్చులుకూడా ఎక్కువ అవుతున్నవి. అప్పులిచ్చినవారి ఒత్తిడివల్ల రైతులు ధాన్యాన్ని ఏదో ఒక ధరకు విక్రయించి అప్పులు చెల్లించవలసిన పరిస్థితి ఏర్పడుచున్నది. నేటి 'హెచ్చుధర'ల వల్ల రైతుకు ఏమాత్రం లాభించడం లేదు. వర్తకులూ, ధాన్యాన్ని నిల్వచేయగల ఆర్థిక స్తోమతున్న పెద్ద రైతులు మాత్రమే లాభిస్తున్నారు. రిజర్వుబ్యాంకు, ప్రభుత్వము ఈ సమస్యలన్నింటినీ సమగ్రంగా, సకాలంలోనే పరిశీలించి సామాన్య రైతులు నష్టపడని విధంగా విధానాలను నిర్ణయించడం అవసరం.

## సౌదీ అరేబియాకు సిరియా క్షమాపణ?

### రక్షణ మంత్రి బర్తరఫ్ పుకార్లు

డమాస్కస్, జూలై 1: సిరియా తాత్కాలిక రక్షణ మంత్రి శ్రీ ఖలేద్ అజ్మాం, వైద్య పరీక్ష చేయించుకొని విశ్రాంతి తీసుకోనేందుకు గురువారం నాడు స్వస్థలానికి వెడుతున్నానని రెండు వారాలవాకా తిరిగి రానని చెప్పారు.

సౌదీ అరేబియా రాజువద్దనుండి ఉత్తరం రావడంతో, శ్రీ అజ్మాంను బర్తరఫ్ చేసినట్లు పుకారుగా ఉందని ఈ రాత్రి ఇజ్రేల్ రేడియో ప్రకటించింది.

సౌదీ అరేబియా రాజుకు అమెరికాతో ఉన్న సంబంధాలను గురించి, శ్రీ అజ్మాం యిటీవల చాలా పరుషంగా మాట్లాడారు. దానిపై డమాస్కస్‌లోని తమ రాయబారిని స్వదేశం రావలసిందిగా సౌదీరాజు రెండు రోజుల క్రితం ఉత్తర్వు చేశారు. విశ్రాంతికోసం స్వస్థలానికి వెడుతున్నానని, శ్రీ అజ్మాం ప్రకటించడంలో అంతరార్థం, సౌదీ రాజుకు సిరియా ప్రభుత్వం లాంఛనంగా క్షమాపణ చెప్పుకోడమేనని అనుకొంటున్నారు.

## విద్యుదాఘాతంవల్ల మృతి

తిరుపతి, జూన్ 30: సహకార విద్యాలయాలలో రక్షణ పూర్తిచేసుకుని స్వస్థలమైన బండరుకు తిరిగి వెళ్లేముందు శ్రీ వెంకటేశ్వరస్వామిని దర్శించి వెడదామని తిరుమలకు వెళ్లిన శ్రీ ఏ. రామమోహనరావు సెట్ వేసుకునే విద్యుత్ ప్రసారంగల ఒక తీగెను పొరపాటున తాకి మరణించాడు. ఇతని వయస్సు 24 సంవత్సరాలు. (స్వ. వి.)

## బ్యాంకులు అప్పులు ఇవ్వడం తగ్గించకపోతే దేశానికి దెబ్బ

### రిజర్వుబ్యాంకు గవర్నరు హెచ్చరిక

### దిగుమతి సరుకులమీద, ఆహార ధాన్యాలమీద అట్టే అప్పులు ఇవ్వవద్దని విజ్ఞప్తి

బొంబాయి, జూలై 1: బ్యాంకులు ఇస్తున్న అప్పులను తగ్గించడం విషయంలో నిర్మాణాత్మకంగా, ఆ అన్ని బ్యాంకులు రిజర్వు బ్యాంకుతో సహకరించాలని అందువల్ల ఆ బ్యాంకులకు కొంతభారం తగ్గడమే గాక, రిజర్వుబ్యాంకు దగ్గరకు డబ్బు కోసం పరుగెత్తుకు వచ్చే అవసరంకూడా కొంత తగ్గుతుందని, రిజర్వుబ్యాంకు గవర్నరు శ్రీ హెచ్. వి. ఆర్. అయ్యంగారు నేడు వివరం చేశారు.

శ్రీ అయ్యంగారు అన్ని బ్యాంకులకు ఇటువంటి అర్థంతో ఒక లేఖను పంపించారు. అందులో ఇల్లా సూచించారు: వ్యవసాయ పుధాన్యాలను కుదువపెట్టుకొని ఇస్తున్న అప్పులను బ్యాంకులు తగ్గించాలి. ముఖ్యంగా, ఈ పని ధాన్యపు గిరాకీలేని కాలంలో జరగవలసివుంది. అంతేగాక, పుష్కలంగా సరఫరా కాని సరుకులకు గూడా అప్పులు ఇవ్వకూడదు. తగ్గించాలి.

"దిగుమతి సరుకుల విషయంలో బ్యాంకులు మరీ జాగ్రత్త వహించాలి. ఇప్పుడు లైసెన్సింగు పద్ధతిలో కట్టుదిట్టాలు చేస్తున్నందువల్ల, ఈ రకం సరుకు కరువైపోతుంది. ధరలు పెంచి లాభాలు తియ్యాలనే దృష్టితో, వర్తకులు, ఈ రకం సరుకును దాస్తారు.

"గిరాకీ లేని కాలంలో అప్పులు ఇవ్వడం తగ్గిస్తే, గిరాకీ తరుణంలో రైతులను వర్తకులను, బ్యాంకులు బాగా ఆదుకోగలుగుతాయి. ఈ లోగా ఆర్థికాభివృద్ధికి అయిన ఇతర కృషులకు సహాయం చెయ్యవచ్చు.

"జరిగిన నాలుసంవత్సరాలలోను బ్యాంకులు ఇస్తున్న అప్పుల మొత్తం పెరిగిపోయింది. జరిగిన రెండేండ్లలో ఇది మరీ అధికమైంది. 1955 జూన్‌లో అన్ని బ్యాంకులుకలిసి రు. 613 కోట్లు అప్పులు ఇచ్చాయి. 1957 జూన్‌లో ఈ మొత్తం ఎంతగావున్నదో అని ఆరాతీస్తే, రు. 932 కోట్లదాకా పెరిగినట్లు తేలింది. ఇందులో ఎక్కువ భాగం అప్పులు గిరాకీలేనికాలంలో ఇచ్చినట్లుగూడా ఈ లెక్కలు చెబుతున్నాయి. గిరాకీలేనప్పుడు అప్పులు అధికంగా ఇవ్వడం, తీరా గిరాకీకాలం వచ్చేటప్పటికి, అవి పడిపోవడం, ఇట్లా ఈ 4, 5 ఏండ్లుగానూ, సాగుతూ వస్తోంది. 1955-56 లో గిరాకీలేని కాలంలో మామూలుగాఇస్తున్న అప్పుల కన్నా 6 కోట్ల రూపాయలు అధికంగా ఈ బ్యాంకులు అప్పులు ఇచ్చాయి.

"ఇస్తున్న ఈ అప్పులు ఇట్లా పెరగడానికి ఎన్నైనా కారణాలుండవచ్చు. కాని వ్యవసాయ ధాన్యాలను వాటిని నిల్వచేసి, ధరలను పెంచి వ్యాపారం చెయ్యాలనే వాళ్ళకు ఈ అప్పులు బాగా ఉపయోగిస్తున్నాయన్న మాటను కాదనడానికి లేదు.

"బ్యాంకులు, అప్పులను, ఇట్లా అధికంగా ఇస్తున్నందువల్ల ఆ బ్యాంకులకు భారం అధికం అవుతోందిగానీ, తరగడంలేదు. ఈ మధ్య అడ్వాన్సులు, డిపాజిట్లు, నిష్పత్తి 75 దాకా పెరిగింది. బ్యాంకులు డిపాజిట్లు పెరుగుతున్నాగూడా ఇది ఇట్లా జరుగుతోంది. అందువల్ల బ్యాంకు, ఈ అప్పులు ఇవ్వడం విషయంలో ఏదో ఒకటి చెయ్యాలి. ఆ చేసేది నిర్మాణాత్మకంగా వుండేట్లు చెయ్యాలి. 1956 లోలాగే, ఇప్పుడు అతరుణంలో అప్పుల క్రింద ఎక్కువడబ్బును వినియోగిస్తే, అతికష్టమైన సమస్యలు తలఎత్తుతాయి. పూర్వము ఇవి తలఎత్తాయిగానీ, ఇప్పుడు తలఎత్తేవి, వాటికన్నా నిష్ఠురంగా వుంటాయి.

"దేశంలో చలామణీద్రవ్యము, పరపతి విస్తరించడంవల్ల, వీర్పడ్డ ఫలితాన్ని మనమెరుపున్న విదేశీ ద్రవ్యపు మొత్తాలను ఉపయోగించి తట్టుకోగలాము. కాని ఇది ఇట్లు ఎంతోకాలం సాగదు. ఈసంవత్సర అభివృద్ధిఖర్చులు, అందుకోసం చలామణీలోకి వచ్చే అదనపుద్రవ్యము, వీటివల్ల బ్యాంకులలో డిపాజిట్లు అధికం అవులాయి. అప్పుడు అప్పులుఇచ్చే వాటి తాహతు గూడా పెరుగుతుంది. ఇటువంటి పరిస్థితిలో మనం జాగ్రత్తగా వుండి, ద్రవ్యోల్బణపు ఒత్తిడులను, తట్టుకోకపోతే, ద్రవ్యోల్బణ విపరిణామాలు అధికం అవుతాయి. అందుకే ఇప్పుడు ఈ గిరాకీలేని కాలంలో అన్ని బ్యాంకులు జాగ్రత్త వహించి, అప్రమత్తంగా మెలగవలసివుంది."

### మదరాసుకు రక్షణ కార్యదర్శి రాక

మదరాసు, జూలై 2: రక్షణశాఖ కార్యదర్శి శ్రీ ఓబుళంపల్లి పుల్లారెడ్డి నిన్న తాంబరంలోని వైమానికదళ కేంద్రాన్ని చూచారు. అక్కడ శిక్షణాతరగతులను తనిఖీచేసి ఉద్యోగులతో చర్చలకు మూడు గంటలు గడిపారు.

ఆయనకు గ్రూప్ కాప్టెన్ శ్రీ సి. సత్యనారాయణ, వింగ్ కమాండర్ ఇ. ఎస్. టాంక్స్ స్వాగతమిచ్చారు. రక్షణ కార్యదర్శి ఉద్యోగులతో విందారగించారు.

## హైదరాబాదులో శీతజ్వరం

### తపాలా కార్యాలయాల పనిగంటల తగ్గింపు

హైదరాబాదు, జూలై 1: శీతజ్వరం కారణంగా ఉద్యోగులలో చాలామంది రాకపోవడంవల్ల హైదరాబాదు జనరల్ పోస్టాఫీసు హైదరాబాదు, సికిందరాబాదు జంట నగరాలలోని కొన్ని తపాలా కార్యాలయాల పని గంటలను తగ్గించారు. హైదరాబాదులో ఇంతవరకూ మొత్తం 2,447 మందికి శీతజ్వరం వచ్చింది. వీరిలో 97 గురు ఆసుపత్రులలో చికిత్స పొందుతున్నారు. 1179 మంది ఇతర వైద్యుల వద్ద చికిత్స పొందుతున్నారు. 380 మంది రోగులకు సంచార వైద్యదళం చికిత్స చేస్తున్నది. 871 మంది రోగులు ఇళ్ళవద్దనే ఉంటూ ఆసుపత్రులలో చికిత్స పొందుతున్నారు.

## మైసూరు రాష్ట్రంలో శీతజ్వరం

### ఇప్పటికి 16 గురి మృతి

బెంగుళూరు, జూలై 1: మైసూరు రాష్ట్రంలో 3 లక్షల మందికి శీతజ్వరం తగిలింది. ఇప్పటికి 16 గురు చనిపోయారు.

కోలారు బంగారుగనుల ప్రాంతంలో ఇద్దరు మరణించినట్లు యివాళ వార్త అందింది.

ఈ నగరంలో నిన్న 1195 మందికి ఇవాళ 1165 మందికి శీతజ్వరం తగిలినట్లు ఆరోగ్యాధికారులకు తెలిసింది. ఇవాళ తెరవవలసిన విద్యాసంస్థలను మరో 10 రోజులపాటు మూయిదాచేశారు. ఉదయము, మధ్యాహ్నం సినిమా ప్రదర్శనలు మరో 10 రోజుల దాకా మొదలుపెట్టకూడదని ఉత్తర్వు చేశారు.

## శీతజ్వరం మళ్లీ విజృంభించాలనిలేదు

### ఐనా జాగ్రత్త అవసరమని కేంద్ర ప్రభుత్వ హెచ్చరిక

న్యూఢిల్లీ, జూన్ 30: శీతజ్వరం పునర్విజృంభించే అవకాశం ఉన్నదంటూ యిటీవల కేంద్ర ఆరోగ్యశాఖ డైరెక్టర్ జనరల్ చేసిన హెచ్చరికపై రాష్ట్ర ఆరోగ్య మంత్రుల సమావేశంలో యీ శాఖ ప్రతినిధి ఒక ప్రకటన చేస్తూ, ప్రజలు అప్రమత్తులుగా ఉండేందుకుగాను డైరెక్టర్ జనరల్ ఆ విధంగా హెచ్చరించారనీ, ఈ వ్యాధి కచ్చితంగా మళ్ళీ రావాలన్న నియమం ఏదీ లేదనీ తెలియజేశారు.

చాలా రాష్ట్రాల్లో ఈ వ్యాధి తగ్గుముఖం పట్టిందనిగూడా వీరన్నారు.

ఈ వ్యాధిని రూపుమాపటంలో వైద్యులు, ప్రజలు, ఆరోగ్యశాఖ అధికారులతో సహకరించినందుకు వీరు సంతృప్తి ప్రకటించారు. ఒక వేళ ఈ శీతజ్వరం మళ్ళీ విజృంభించినప్పటికీ, ఈ ప్రమాదంనుంచి ప్రజలను తప్పించటానికి తాము సర్వసన్నాహాలతో సంసిద్ధంగా ఉన్నామనిగూడా వీరు తెలియజేశారు.

## రాజస్థాన్‌లో కొత్తగా 8 వందలమందికి జ్వరం

జైపూర్, జూన్ 30: రాజస్థాన్‌లో కొత్తగా 8 వందలమంది పైచిలుకు శీతజ్వరంతో బాధపడుతున్నారని అధికారులు ప్రకటించారు. వీరిలో 5 వందల మంది పైచిలుకు నగరంలోనివారే.

## జమ్ము శ్రీనగర్ ప్రేలుళ్లు

### పాక్ విద్రోహుల చర్య: మందు సామగ్రి జప్తు

శ్రీనగర్, జూలై 1: క్రితం పదిహేను రోజులుగా జమ్ము శ్రీనగర్ లలో సంభవించిన ప్రేలుళ్ళ సందర్భంలో కాశ్మీర్ పోలీసులు ఆచూకీ తీసి, పాకిస్తాన్‌నుంచి దొంగచాటుగా రవాణా అయిన మందు సామగ్రిని పట్టుకొన్నారు. ఈ సంగతి ఇవాళ అధికారరీత్యా తెలిసింది.

ఈ మందు సామగ్రికి, పాటంతటవి ప్రేలే ఏర్పాటు ఉన్నదట. నేర్పరులైన వారుతప్ప మామూలువాళ్ళెవరూ వీటిని ఉపయోగించలేరట.

జూన్ 27 అర్ధరాత్రి ఇక్కడ సినిమా హాలువద్ద బాంబుప్రేలుడు జరిగినదిమొదలు పోలీసులు చాలాచోట్ల సోదాలుచేసి, ప్రేలుడు పదార్థాలు విశేషంగా పట్టుకొన్నారు. వీటిలో కొన్ని శ్రీనగర్ సమీపంలో ఒక తూము వంతెనక్రింద దాటుపెట్టిఉన్నాయట. నిన్న పోలీసులు చాలామందిని నిర్బంధించి సోదా చేశారు. వారిలో కొందరిని అరెస్టుచేశారు.

అంతరంగికంగా కల్లోలం లేవతీసి, ప్రజలలో భయోత్పాతం కలిగించడానికి, విద్రోహుల ముఠాయే, యీ ప్రేలుళ్లుసాగిస్తున్నదనిపోలీసులు అంటున్నారు.

శ్రీనగర్ లో బాంబు ప్రేలినప్పటికీ, ప్రజలేమీ కలవరపడలేదు. అంతా మామూలుగానే సాగిపోతున్నది.

## రెండో ప్రణాళికలో కొన్ని కార్యక్రమాల మినహాయింపు?

### కేంద్రప్రభుత్వ శాఖలకు నెహ్రూ లేఖ: ప్లానింగ్ కమిషన్ ఆమోదం అవసరం

న్యూఢిల్లీ, జూలై 1: రెండో ప్రణాళిక అమలును గురించి ఏ శాఖ ఎటువంటి ప్రతిపాదనలు చేస్తున్నా, ముందుగా ప్లానింగు కమిషన్‌తో ఆలోచించాలని, ఆ ప్రణాళిక అమలుకు ప్లానింగు కమిషన్ నిర్ణయించిన మార్గానికి, అవి అనుకూలంగా వున్నదీ, లేనిదీ, అట్లా సంప్రదించి తేల్చుకోవాలి, ప్రధానమంత్రి శ్రీ నెహ్రూ కేంద్ర ప్రభుత్వం అన్ని శాఖలకు సూచించారు.

విదేశాలకు ప్రయాణమై బయలుదేరిపోయేముందు ప్రధమంత్రి శ్రీ నెహ్రూ కేంద్ర ప్రభుత్వం తాలూకు అన్ని శాఖలకు ఈ ఆదేశపత్రాన్ని పంపించారు. ఇందులో విదేశీ ద్రవ్యం కొరత, ధరలపరిస్థితి, ఖర్చులపెంపు, అన్ని విషయాలను సమీక్షించి, మనం ఎటువంటి ప్రతిపాదనలుచేసినా, అవి, ప్రణాళిక అమలుకు సంబంధించిన విధానానికి అన్నివిధాలా అనుకూలంగా వుండేట్లు చూచుకోవలసి వున్నదని, మా శాఖ ఖర్చులు, ఇవి తప్పకుండా జరిగితీరాలి అని భావించడం తగదనీ, అందువల్ల, ప్రతిశాఖవారు గూడా తమ ప్రతిపాదనలను, ప్లానింగు కమిషన్‌కుపంపి, వారి అనుమతిని పొందాలని కోరారు.

"దేశంలో ధరలు పెరగడంవల్ల ప్రణాళిక ఖర్చులు రు 5500 కోట్లదాకా పెరిగాయి. ఇవి రు 6000 కోట్లు అయ్యే చిహ్నాలు కన్పిస్తున్నాయి. ఇప్పుడు యీప్రణాళికను విధిగా అమలుజరుపుతామని ప్రభుత్వం చెబుతున్నది అంటే, అందులోవున్న పరిశ్రమలవిభాగాన్ని తప్పకుండా అమలు జరుపుతుందని అర్థం. తక్కిన అల్పమైన కార్యక్రమాలను ఆపివేసినా, అప్పుడు తప్పులేదు. అందువల్ల యీప్రణాళికను అమలు జరిపేప్పుడు, ఏపని ముందు జరగాలో, ఏది అనంతరం జరగాలో, నిశ్చయించుకోవలసి వుంది. ఈపనిని మంత్రిమండలియో, లేక ప్లానింగు కమిషనో చెయ్యాలి. అంతేగాని, ఎవరికివారు చెయ్యడం పనికిరాదు" అన్నారు.

## సూయజ్ సమస్య అదుపులోకి వచ్చింది — హామర్షెల్డ్

స్టాక్‌హోం, జూన్ 29: సూయజ్ సమస్య అదుపులోకి వచ్చిందనుకోవచ్చు; సమస్య పరిష్కారం కాకపోయినా, అవకాశాలు కనపడుతున్నాయి, అని సమితి కార్యదర్శి శ్రీ హామర్షెల్డ్ చెప్పారు.

గాజా ప్రాంతంలో సమితి సైన్యం ఇంకాఎంతకాలం ఉండవలసివస్తుందో ఇప్పుడప్పుడే చెప్పడం కష్టంఅన్నారు.

## సూడాన్‌లో భారత రాయబారి

న్యూఢిల్లీ, జూలై 1: ఇదివరలో లోక్ సభ సభ్యులుగా ఉన్న శ్రీ బాల్కృజీ పోలోస్ మాథేస్ నుసూడాన్లో భారత రాయబారిగా నియమించినట్లు, భారత విదేశాంగశాఖ ఇవాళ ప్రకటించింది.

శ్రీ మాథేస్ జూలైనెల మధ్యలో ఆ పదవి స్వీకరిస్తారు. ఈయన వయస్సు 67 సంవత్సరాలు. 1939 వరకు నిరువాన్కూర్ నేషనల్, క్విలన్ బ్యాంకు మేనేజింగ్ డైరెక్టరుగా పనిచేశారు. ఆ తెప్పి కంపెనీ, మలబార్ మినరల్స్ సంస్థను స్థాపించినది ఈయనే. 1951 లో లోక్ సభకు ఎన్నికైనారు.

## బ్రిటిష్ ప్రధానితో చర్చ: సురావర్దీ సంతృప్తి

లండన్, జూన్ 29: బ్రిటిష్ ప్రధాని శ్రీ మాక్మిలన్‌తో నిన్న ప్రత్యేకంగా జరిపిన చర్చలకు శ్రీ సురావర్దీ సంతృప్తి చెందారని, పాకిస్తాన్ వర్గాలవారుచెబుతున్నారు. ఈ చర్చలవల్ల, పంజాబు నదీ జలాలపై భారతదేశంతో తగవులో పాకిస్తాన్‌కు కామన్వెల్త్ రాజ్యాల సానుభూతి లభిస్తుందని శ్రీ సురవర్దీ భావిస్తున్నారట.

నదిజలాలసమస్యను ప్రపంచన్యాయస్థానంలో విచారణకు తీసుకు రానివ్వాలని శ్రీ సురావర్ది బ్రిటిషు ప్రధానితో వాదించారని తెలుస్తున్నది.

[కామన్వెల్త్ రాజ్యాలు ఒకదానిపై ఒకటి ప్రపంచ న్యాయస్థానంలో ఫిర్యాదులు చేసుకోరాదనీ, చేసుకోవాలంటే రెండు రాజ్యాలూ ఆమోదించాలనీ ఒక సంప్రదాయం ఉంది.]

ఇవాళ రాత్రి శ్రీ సురావర్దీ బ్రిటిషు ప్రధాని నివాస భవనం 'చెకర్స్' లో ఆతిథ్యం స్వీకరిస్తున్నారు. వీరితోపాటు రోడీషియా ప్రధాన మంత్రి, దక్షిణాఫ్రికా విదేశాంగ మంత్రి, సింహళ న్యాయశాఖా మంత్రి శ్రీ డిసిల్వాకూడ అక్కడ ఆతిథ్యం స్వీకరిస్తున్నారు.

శ్రీ డిసిల్వాకూడా ఇవాళ రాత్రి అక్కడ ఉంటారు కాబట్టి, ఈసమస్య పరిష్కారం విషయంలో కొంత మేలు కలగవచ్చు ననుకొంటున్నారు.

మదరాసు, జూలై 2: ఆంధ్ర ప్రదేశ్ ముఖ్య మంత్రి నీలం సంజీవరెడ్డి నిన్న రాత్రి బయలుదేరి తిరుపతి వెళ్ళారు. ఇవ్వాళ రాత్రికి తిరిగి వచ్చి రేపు ఉదయం విమానంలో హైదరాబాదు వెడతారు.

## శివసముద్రం విద్యుత్ కేంద్రంలో 11 గురి మృతి

### 16 గురికి గాయాలు: విచారణకు రాష్ట్ర ప్రభుత్వం ఉత్తర్వు

బెంగుళూరు, జూలై 1: శివసముద్రం జల విద్యుత్ కేంద్రంలో, యీ ఉదయం పెద్దనీటిగొట్టం మీద పడడంచేత 11 గురు ఆ గొట్టం క్రింద నలిగి చనిపోయారు. 16 గురు గాయపడ్డారు. వీరిలో కొందరికి బలమైన గాయాలు తగిలాయి.

ఈ ప్రమాదం సంగతి విచారించడానికి మైసూరు ప్రభుత్వం ఉత్తర్వు చేసింది. మైసూరు డివిజనల్ కమిషనర్ విచారణ జరుపుతారు.

చనిపోయిన వారి కుటుంబాలకు గాయపడిన వారికి రాష్ట్ర ప్రభుత్వం సానుభూతి తెలియజేసింది.

నీటిగొట్టాలను ఉన్న వాటిని తీసి కొత్తగొట్టాలను వేస్తుండగా, ఒక గొట్టం తాడు తెగి చాలా ఎత్తునుంచి పనివాళ్ల మీద పడింది. అక్కడికక్కడే 8 మంది చనిపోయారు. తీవ్రంగా గాయపడిన మరో ముగ్గురు తరువాత చనిపోయారు.

ఈ ప్రమాదం వార్త తెలియగానే విద్యుచ్ఛక్తి ప్రధాన ఇంజనీరు అక్కడకి వెళ్లారు. దర్యాప్తు జరుగుతోంది.

## గొప్పకట్టడాల ఆపుదలకు రైల్వే శాఖ నిర్ణయం

### వ్యయకర్తన సంఘం ఏర్పాటు

న్యూఢిల్లీ, జూలై 1: రైల్వేశాఖకు సంబంధించిన గొప్ప కట్టడాల నిర్మాణాన్ని నిలిపివేయటానికి రైల్వేమండలి నిర్ణయించింది. ఇంతేగాకుండా యిదివరలో ఆమోదం పొంది, యింకా ఆరంభంకాని సమస్త నిర్మాణాలను యీ శాఖ పునఃపరిశీలిస్తున్నది. రైల్వే వ్యయంలో దుబారాను అరికట్టి పొదుపు జరిగేటట్లు వివిధచర్యలు తీసుకునేందుకుగాను రైల్వే మండలి, ఒక వ్యయకర్తన సంఘాన్ని ఏర్పాటు చేసింది.

రైల్వేమండలి అదనపు సభ్యులు ఆర్థిక వ్యవహారాల డైరెక్టరు కార్యవిధులను దక్షతతో నిర్వహించటానికి నియమించిన సంఘం సంయుక్త డైరెక్టరు యీ సంఘంలో సభ్యులుగా ఉంటారని తెలుస్తున్నది.

ప్రతి రైల్వేమండలంలో కూడా, యీసంఘం శాఖను ఒకదాన్ని నెలకొల్పుతారు.

ఈసంఘ నియామకానికి ముందు నుంచీ, రైల్వేలలో దుబారా ఖర్చులను అరికట్టేందుకు మండలి అనేక చర్యలను తీసుకున్నది.

రైల్వేలకు చెందిన ఆస్తులతోపాటు, ఉద్యోగులు, ఇతర సాధనసామాగ్రుల ద్వారా అత్యున్నత ఫలితాలను రాబట్టటానికి నిరంతరం జాగ్రత్తగా కృషి జరిగేటట్లు చర్యలు తీసుకోవటం జరిగింది.

ప్రస్తుత పరిస్థితులలో తప్పించుకునేందుకు వీలులేని నిర్మాణాలనుమాత్రమే కొనసాగిస్తారు. విధిగానిర్మించవలసిన కట్టడాలఖర్చులను అతి కనిష్ఠంగా కోసి వేస్తారు.

ఇదిలాఉండగా కార్యాలయాల్లో అనంతంగా కొనసాగే ఉత్తరప్రత్యుత్తరాలు, వల్లమాలిన నివేదికలను బాగా తగ్గించివేయటానికి ఆలోచనలు జరుగుతున్నాయి. ఆమోదించిన ఉద్యోగాల కాలపరిమితిని యింకా పొడిగించే అంశాన్నిగూడా వీరు పరిశీలిస్తారు.

ఇదేవిధంగా మండలవ్యయకర్తన సంఘాలు, రైల్వేలలో బయట (ఫీల్డ్) జరిగే కార్యకలాపాలను గూడా పరిశీలిస్తాయి.

రైల్వేపథకాలు సక్రమంగా రూపొందింది లేనిదీ, వీటినిర్మాణంలో ధనంతోపాటు, అత్యవసరవస్తు సామగ్రిని పొదుపుగా వాడుతున్నదీ లేనిదీ సమర్థంగా పరిశీలించేందుకు వివిధరైల్వే మండలాల్లో ప్రత్యేకశాఖలను ఏర్పాటుచేశారు.

## రాష్ట్రంలోని ఆదిమవాసి ప్రాంతాల్లో ధేబర్ పర్యటన

న్యూఢిల్లీ, జూలై 1: ఆంధ్రప్రదేశ్‌లోని ఆదిమవాసి ప్రాంతాలలో కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ యు. ఎన్. ధేబర్ సెప్టెంబరు 25 వ తేదీనుంచి పర్యటిస్తారని శ్రీ వెన్నెలకంటి రాఘవయ్య తెలియపరుచుతున్నారు.

సెప్టెంబరు 26 వ తేదీని శ్రీ ధేబర్ మైసూరునుంచి నెల్లూరుకి వస్తారు. అక్కడినుంచి తెలంగాణాలోని ఆదిమవాసి ప్రాంతాలు దర్శించడానికి బయలుదేరి వెళ్ళుతారు. తెలంగాణాలో వారం రోజులపాటు పర్యటిస్తారు. తరువాత ఆంధ్రలోని ఆదిమవాసి ప్రాంతాలు దర్శిస్తారు.

## యుగోస్లావ్ ఉపాధ్యక్షుని భారత సందర్శనం

బెల్గ్రేడ్, జూలై 1: యుగోస్లావియా ఉపాధ్యక్షుడు శ్రీ స్వెటోజార్ వుకమనోవిక్ టెంపో యీ వేసవిలో భారత, పాకిస్తాన్‌లను సందర్శిస్తారని యివాళ అధికారరీత్యా ప్రకటించారు.

## సంపాదకునకు లేఖలు

### వెలగలేరులో అంటువ్యాధులు

అర్యాపూరుపేట మేజరు పంచాయతీని ఆనుకొనివున్న వెలగలేరు పంచాయతీ ప్రాంతంలో ఇటీవల కురిసిన వర్షాల కారణంగా శీతజ్వరం, అంటువ్యాధులు ప్రబలేసూచనలు ఎక్కువగా కనబడుతున్నవి.

మురుగునీటి పారుదల కాలవలను పంచాయతీ శ్రద్ధ తవ్వించలేదు. గ్రామంలో తూములను ఎక్కడికక్కడ బంధించివేయడంవల్ల ఈ మూడురోజులనుంచి కురిసిన వర్షం నీరు ఎక్కడికక్కడ ఆగిపోయి పంచాయతీ రోడ్లు నీటిమయమయి పోయినవి. కోటేరు - వల్లజర్ల రోడ్డుకూడా నీటిమయమయినది. గ్రామమును ఆనుకొని ఉన్న మురుగుదొడ్డిఅంతా నీటిమయమయి పోయి, దుర్గంధముతో కూడిన నీరు గ్రామంలోని ఇండ్లముందు వరద్నలాగా చేరింది. పంచాయతీ దృష్టికి గ్రామస్థులు ఈ సంగతి తీసుకురాగా గ్రామపంచాయతీ అధ్యక్షులు ఇప్పుడు తీరికలేదని తొందరలోనే తగు కర్తవ్యం ఆలోచిస్తామనీ అంటున్నారు. ఈ గ్రామంలో ఇప్పటికే శీతజ్వరాలతో చాలామంది బాధపడుతున్నారు. ఈ మురుగు ఇండ్లలోకి జొరబడినందువల్ల మూత్కోటీ పులూ దోమలూ, ఇతర క్రిములూ, ఎక్కువై ఘోరవ్యాధి వచ్చే సూచనలు కనబడుతున్నవి. శీతజ్వరం కూడా ఎక్కువవుతున్నది. వెంటనే ఆరోగ్యశాఖాధికారులు చర్యలు తీసుకోకపోతే ప్రమాదం వాటిల్లగలదని గ్రామస్థులు ఆందోళన పడుతున్నారు.

మారుటేరు, వి. వి. రాజు

* * *

### దక్షిణ ఆహారమండలాన్ని ఏర్పాటుచేస్తే...

ఆంధ్రప్రదేశ్, మైసూరు, మద్రాసు రాష్ట్రాలలో కలిపి దక్షిణ ఆహారమండలము యేర్పడినప్పటికీ, ఆహార ధాన్యాల ధరలు తగ్గే అవకాశం ఉన్నదని అంటున్నారు. మైసూరుప్రాంతానికి అంతగా ఇక్కడి ఆహార ధాన్యాలు అవసరం ఉండదు. మద్రాసు ప్రాంతంవారు హెచ్చు ధరలకు కొనటానికి ఇష్టపడరు కాబట్టి ధరలు అంతగా పెరగటానికి అవకాశం ఉండదని అభిజ్ఞుల ద్వారా తెలుస్తోంది. అయితే ఈ మండలంలో కేరళ రాష్ట్రాన్ని చేర్చకపోతే మద్రాసు వ్యాపారస్థులు ధాన్యాన్ని కేరళరాష్ట్రానికి రవాణాచేసే అవకాశం ఉంటుంది కాబట్టి ఆ అవకాశం లేకుండా దక్షిణ ఆహార మండలంలో కేరళ రాష్ట్రాన్ని కూడా చేర్చాలని కోరుదరు అంటున్నారు.

యెగుమతి పరిమితం చేసినపుడు ధరలు తగ్గవచ్చు. ఆహారధాన్యం నిలవ ఉండడానికి వాగన్ల కొరతే కారణమని అంటుచ్చారు. నిలవలున్నప్పుడు ధరలు తగ్గే బదులు పెరుగుతున్నవి.

తాడేపల్లిగూడెం, కె. కృష్ణారావు

## సింధు జలాల పంపిణీ

### ప్రపంచ బ్యాంకు ప్రతిపాదనలు మారలేదు

న్యూఢిల్లీ, జూలై 1: భారత పాకిస్తాన్ల మధ్య సింధునదీ జలాల పంపిణీ పద్ధతి సూచిస్తూ 1954 లో ప్రపంచ బ్యాంకు చేసిన ప్రతిపాదనలు అలాగే ఉన్నాయని, ప్రపంచ బ్యాంకు ఉపాధ్యక్షుడు శ్రీ ఐలిఫ్ ఇటీవల ఉభయ ప్రభుత్వాలతో జరిపిన చర్చలవల్ల, ఆ ప్రతిపాదనలలో యే మార్పూ రాలేదని, ఇవాళ అభిజ్ఞవర్గాలద్వారా తెలిసింది.

1954 లో ఆ ప్రతిపాదనలు ఎలా ఉన్నాయో యిప్పుడుగూడా సరిగ్గా అలాగే ఉన్నాయని యీ వర్గాలవారు స్పష్టం చేశారు.

ఇదివరకు వాటిని, సవరించి ప్రపంచ బ్యాంకు ఉపాధ్యక్షుడు అందజేసిన ప్రతిపాదనలను భారత పాకిస్తానులు ఇప్పుడు పరిశీలిస్తున్నాయంటూ, కరాచీ నుంచి యీ మధ్య వార్తలువచ్చాయి. ఈ వార్తలపై వ్యాఖ్యానంచేస్తూ, అభిజ్ఞవర్గాలవారు పైవిధంగా చెప్పారు.

ఇటీవల శ్రీ ఐలిఫ్ చర్చలు పూర్తిచేసుకొని వాషింగ్టన్ వెళ్లేముందు, యీ వివాదంపై ఉభయ ప్రభుత్వాలకు ఒకే విధంగా వ్రాశారని వీరు తెలియజేశారు. శ్రీ ఐలిఫ్ పత్రికా విలేఖరులకు అందజేసిన ప్రకటనలో తాను ఉభయ ప్రభుత్వాలకు పంపిన లేఖలలో కొన్ని సూచనలున్నాయని, 1954 లో ప్రపంచ బ్యాంకు చేసిన ప్రతిపాదనల పద్ధతిలో, యీ సమస్యా పరిష్కారానికి వీలు కల్పించే ఉద్దేశ్యంతోనే యీ సూచనలు చేయడమైందని పేర్కొన్నారు. ఈ అభిజ్ఞవర్గాలవారు, యీ సందర్భంలో శ్రీ ఐలిఫ్ ప్రకటనను ఉదహరిస్తూ "1954 లో ప్రపంచ బ్యాంకు ప్రతిపాదనల పద్ధతిలో" అన్న మాటలనుబట్టి యీ ప్రతిపాదనలలో మార్పేమీ లేదని స్పష్టమాతున్నది అన్నారు.

## పాక్ విమానం గల్లంతు

### 24 గురి ప్రయాణికుల దుర్గతి

ఢక్కా, జూలై 1: ఇరవై నలుగురు ప్రయాణికులను ఎక్కించుకొని చిట్టగాంగ్ నుంచి ఢక్కాకు బయలుదేరిన విమానం మార్గమధ్యంలో మటుమాయమైంది.

తుపానుగా ఉన్న పరిస్థితి ఉదయం 8-10 గంటలకు విమానంలో బయలుదేరి ఢక్కా చేరడానికి గంటకన్నా ఎక్కువ పట్టదు.

చిట్టగాంగ్ - ఢక్కా, చిట్టగాంగ్ కలకత్తా మార్గాలలో తిరిగే ఐదు విమానాలు యీ విమానంకోసం పగలల్లా వెదికి చీకటి పడేసరికి అన్వేషణ విరమించాయి.

ఇది తోస్తావెంబడి ఎక్కడైనా బలవంతంగా దిగిపోవడంగాని, మధ్యలో బంగాళాఖాతంలో కూలిపోవడంగాని జరిగి ఉండవచ్చునని భయపడుతున్నారు.

మళ్లీ రేపు ఉదయం అన్వేషణ ప్రారంభమవుతుందని పాక్ అంతర్జాతీయ విమానసంస్థ జిల్లామేనేజర్ శ్రీ ఎం. కమాల్ చెప్పారు.

మదరాసు ఎగువసభ అధ్యక్షుడు డాక్టరు పి. వి. చరియన్ నిన్న లండన్ నుండి తిరిగివచ్చారు. డాక్టర్ చరియన్ లండన్‌లో కామన్‌వెల్తు పార్లమెంటరీ అసోసియేషన్ తరఫున జరిగిన రాజకీయోపన్యాసాలకు హాజరయ్యారు.

# పెక్కు ధర్మ సంస్థల నిధుల దుర్వినియోగం

## పిఠాపురం దివాన్ ఇల్లు సోదా:

## రాజమండ్రిలో విచారణ ప్రారంభం

(ఆంధ్రపత్రిక విలేఖరి)

రాజమండ్రి, జూన్ 30: తూర్పు గోదావరి జిల్లాలో అనేక ధర్మసంస్థల నిధులు దుర్వినియోగమైనాయి. పిఠాపురంలోని సంస్థాన సత్ర నిర్వహణాధికారాన్ని దుర్వినియోగ పర్చారన్న అనుమానంతో పిఠాపురం దివాన్ శ్రీ కోట శివనాథశాస్త్రి ఇంటిని నిన్న పోలీసులు సోదాచేసి అనేక రహస్య పత్రాలు స్వాధీనపర్చుకున్నారు. నిర్వహణాధికారిగా తరువాత పనిచేసిన శ్రీ సి. అంజయ్యను కూడా తాత్కాలికంగా తొలగించారు. ఈ విషయాలన్నింటిపైన గత మూడు రోజులుగా దేవాదాయ ధర్మాదాయ సంస్థల అజమాయిషీ ప్రత్యేకోద్యోగి శ్రీ టి. సీతాద్రిరావు విచారణ ప్రారంభించారు.

పట్టణంలోని ఆల్కాటు తోట ప్రాంతంలో గోదావరిగట్టున వుంటూ సంఘసేవచేస్తూ పరమపదించిన శ్రీ పరశురామ అవధూత స్వాములవారు సంఘసేవకు కేటాయించిన రు 60 వేలు ధర్మనిధిని ధర్మకర్తలు సక్రమంగా వినియోగించలేదని ఈ నిధినిర్వహణలో దుర్వినియోగం జరిగినట్లు కనిపించిందనీ, ఒకధర్మకర్త అసలు విచారణకే హాజరుకాలేదని ఇదంతా ప్రభుత్వానికి తెలియబరచామని ప్రత్యేకోద్యోగి చెప్పారు.

ఏటా రు 6 వేలు ఆదాయం రాగల ఆస్తులు కలిగివున్న రామచంద్రపురం తాలూకా వల్లూరు గ్రామ దేవాలయాల నిర్వహణపై వచ్చిన ఫిర్యాదులను విచారిస్తున్నామని తెలియజేశారు.

### సామర్లకోటలో ధర్మం పేరుతో రు 1 లక్షస్వాహా

సామర్లకోటలోని మట్టపల్లి వారి ధర్మసంస్థ నిధులు సుమారు రు 1 లక్ష వరకు వుంటాయి—అవి అసలు ధర్మకార్యాలకే వినియోగించలేదని గుర్తించామని, ఇదికూడా ప్రభుత్వానికి తెలియబరచమని చెప్పారు.

### దివాన్ ఇల్లు సోదా: అధికారి తొలగింపు

పిఠాపురంలోని సంస్థాన సత్రానికి రు 1 లక్ష ఆస్తివున్నది. దీని తాలూకు రికార్డులు, అమూల్యపుస్తకాలు జనవరి 28 న సంస్థాన దివాను, సర్వమ స్వతంత్రాధికారి అయిన శ్రీ కోట శివనాథశాస్త్రి వద్దనుంచి స్వాధీనపర్చుకుని శ్రీ సి. అంజయ్య అనే నిర్వహణోద్యోగికి వప్పగించారు. పెట్టెల్లో కొన్ని రికార్డులు ఎలాగో తిరిగి శ్రీ శివనాథశాస్త్రికి చేరాయి. అందులో కొన్నిమాత్రమే మార్చి 11 న ఆ నిర్వహణోద్యోగికి అందాయి. తరువాత ఆ వుద్యోగిని తాత్కాలికంగా తొలగించారు.

నిన్న పిఠాపురంలో శ్రీ శివనాథశాస్త్రి ఇంటిని కాకినాడ పోలీసుదళం సహాయంతో రాజమండ్రి దేవాదాయ అసిస్టెంటు కమీషనరు శ్రీ రంగనాథరావు సోదాచేసి దాచివుంచిన రికార్డులను చాలావరకు ఇవతలకు లాగారు.

పిఠాపురం రాజా యువరాజు తనకోసం వ్రాసిన ధర్మపత్రం ప్రతికూడా ఒకటి దొరికిందట. దానిలో బ్రహ్మసమాజానికి రు 1 లక్ష ధర్మనిధిని ఏర్పరిచారట. దర్యాప్తు సాగుతోంది.

# రు 75 వేల నగల అపహరణ

హైదరాబాదు, జులై 2: హైదరాబాదులోని ఆబిడ్ రోడ్డులోని సూరజ్ మల్ లాల్ దుకాణంలో దెబ్బయి-డెబ్బైఐదు వేలరూపాయలనగలనుకిందటి రాత్రి దొంగలు ఎత్తుకుపోయినారు.

దుకాణానికి కాపలాఉన్న చౌకీదారు ఇవాళ్ళ ఉదయం మొదట చూచాడు. దుకాణం తాళాన్ని సరిగ్గా ఉన్నదీ లేనిదీ కిందటిరాత్రి చౌకీదారు చూచాడట. తాళాలన్నీ సరిగ్గానే ఉన్నవట.

దుకాణం వెనుకవైపు తలుపుకు దొంగలు మొదట రంధ్రాలు చేశారు. ఆరంధ్రాలను ఎదురుగావున్న తలుపులను చిన్నరంపంతో కోసి ఒకమనిషి లోపలికి వెళ్ళడానికి వీలైనంత రంధ్రం కోశారు.

ఈ దొంగతనం సంగతి తెలియగానే నగర నేరవిభాగం పోలీస్ డిప్యూటీ కమీషనరు శ్రీ వేణుగోపాలరావు, తదితర పోలీసు అధికారులు అక్కడికివెళ్ళి చూచారు. దర్యాప్తు ప్రారంభమైంది.

దుకాణంలోని అల్మారాలన్నీ తెరిచి ఉన్నవి. ఖాళీ నగలపెట్టెలన్నీ చిందరవందరగా పడిఉన్నవి. ఇవాళ్ళ ఉదయం దుకాణం ముందు జనం గుంపులుగుంపులుగా చేరి చూస్తున్నారు. ఆప్రాంతంలోనివారందరికీ ఈ దొంగతనం సంభ్రమాశ్చర్యాలు కలిగించినది.

# పశ్చిమాసియాలో అమెరికా విధానం

## చైనాపై వ్యాపార నిర్బంధాలు

### అమెరికా సడలించదు

### తూర్పు యూరప్ పట్ల ఉదారం చూపుతుంది

వాషింగ్టన్, జూలై 1: వ్యాపార నిర్బంధాల విషయంలో, తూర్పు యూరప్ కమ్యూనిస్టు రాజ్యాలతో అయితే అమెరికా కొంత ఉదారం చూపి నిర్బంధాలు సడలించడానికి ఒకప్పుకోవచ్చు, కాని చైనా, ఉత్తరకొరియాలపై నిర్బంధాలను సడలించరాదని అమెరికా దృఢసంకల్పంతో ఉంది, అని అంతర్జాతీయ సహకార సంస్థ డైరెక్టరు శ్రీ జాన్ బి. హోలిస్టర్ కాంగ్రెసుకు అందచేసిన నివేదికలో స్పష్టపరిచారు.

1951 "యుద్ధ చట్టం" నిర్వహణ గురించి శ్రీ హోలిస్టర్ అందచేసిన తొమ్మిదో అర్ధసంవత్సర నివేదికలో, అమెరికా అనుసరిస్తున్న వ్యాపార నిర్బంధవిధానాన్ని సమగ్రంగా సమీక్షించారు.

ఈ వ్యాపార నిర్బంధవిధానాన్ని సడలించాలని 1953 లో పశ్చిమ యూరప్‌లో ఉద్యమం ప్రారంభమయింది. ప్రపంచ ఆర్థిక, రాజకీయ పరిణామాలవల్ల, ఈ ఉద్యమం బయలుదేరింది, అని శ్రీ హోలిస్టర్ అన్నారు. ఆ పరిణామాలు నిర్లక్ష్యపరచడానికి వీలులేనివన్నారు.

# సిరియాకు ఇజ్రేల్ కొత్త ముప్పు

## కైరో డమాస్కస్ సేనాధిపతుల చర్చలు

కైరో, జులై 1: సిరియాకు ఇజ్రేల్ నుండి యేదో కొత్త ప్రమాదం సంభవించనున్నట్లు తెలిసి, సిరియా, ఈజిప్టుల సమష్టి సేనాధిపతులు ఆ ప్రమాదాన్నెదుర్కొనడానికి రెండురోజులుగా వ్యూహాలు పన్నుతున్నట్లు తెలిసింది.

ఇటు సిరియా, అటు ఇజ్రేల్ సరిహద్దులవద్ద కొంత సైన్యాన్ని తరలిస్తున్నట్టు వార్తలు వస్తున్నాయి. ఇజ్రేల్ తన సైన్యాలను హూల్యాలే సరస్సు ప్రాంతంలో కేంద్రీకరించిందట. ఈ సంగతి సిరియా ప్రభుత్వం, సిరియా-ఇజ్రేలీ యుద్ధవిరమణ పర్యవేక్షక సంఘానికి ఫిర్యాదు చేసినట్లు తెలిసింది.

యుద్ధవిరమణ ఒప్పందానికి భిన్నంగా హూల్యాలే ప్రాంతంలో ఇజ్రేల్ నిర్మించిన వంతెన పడగొట్టించాలని, ఇది సిరియాపై దెబ్బతీయడానికి కట్టిన వంతెన అని మూడు నెలల క్రింత సిరియా భద్రతా మండలికి ఫిర్యాదుచేసింది.

భద్రతా మండలి యీవిషయం విచారించి, తెలుపవలసినదిగా, పాలస్తీనాలోని సమితి యుద్ధ పర్యవేక్షక సంఘ ప్రధానాధికారి కర్నల్ బైరన్ లేరీనికోరింది. ఆయన ఇవాళ మండలికి పంపిన నివేదికలో "హూల్యాలే ప్రాంతంలో నిర్మించిన కట్టడాలను పడగొట్టడానికి ఇజ్రేల్ నిరాకరించిందని తెలియజేశాడు. అయితే ఈజిప్టుపై దండయాత్ర ప్రారంభమైన తరువాత నిస్సైనిక ప్రాంతంలో మాటు పెట్టిన మందుగనులను తీసివేస్తామని ఇజ్రేల్ హామీ ఇచ్చిందట.

# కమ్యూనిజానికి దోహదం

## ఐక్ సూత్రాన్ని గూర్చి నాసర్ విమర్శ

### "ఇజ్రాయల్ మాటలువిని అరబ్ రాజ్యాలకు పశ్చిమరాజ్యాలుదూరంఅయిపోతున్నాయి"

లండన్, జులై 1: పశ్చిమ ఆసియాలో అమెరికా అనుసరిస్తున్న విధానంవల్ల, జాతీయవాదులు గూడా కమ్యూనిష్టులుగా మారిపోయేస్థితి ఏర్పడుతున్నదని ఈజిప్టు అధ్యక్షుడు శ్రీ నాసర్ హెచ్చరించారు.

బ్రిటిష టెలివిజన్ వార్తా సంస్థ తాలూకు విలేఖరి శ్రీ రాబిన్ డే, ఐక్ సూత్రాన్ని గురించి వేసిన ప్రశ్నలకు శ్రీ నాసర్ సమాధానం ఇచ్చారు. మధ్య ప్రాచ్యంలో జాతీయవాదమే గాని కమ్యూనిజం లేదు కాని అమెరికా పెద్దలు జాతీయ వాదన్ని కమ్యూనిజంగా ప్రచారం చేస్తూ, ఆ జాతీయవాదాన్ని విరుద్ధంగా చేద్దామని చూస్తున్నారు. ఈ పనికిమాలిన ప్రయత్నంవల్ల వీరు జాతీయవాదులను గూడా కమ్యూనిస్టులుగా మార్చి వేస్తున్నారు అన్నారు.

శ్రీ నాసర్ తన అనుభవాన్నిబట్టి మాట్లాడారు. ఐదు సంవత్సరాలు గాఢా అనుభవం వల్ల తేలింది ఇది. జాతీయమైన విధానాలను అనుసరించడంవల్ల ఈజిప్టులో కమ్యూనిజం అంటే ఛాదాసిన్యం ఏర్పడిపోయింది. మా దేశంలో కమ్యూనిజంకు న్యాయసిద్ధమైన స్థితి ఏమీ లేదు" అన్నారు.

రష్యాతో సంబంధాలను గూర్చిన ప్రశ్నలకు సమాధానం ఇస్తూ, శ్రీ నాసర్, కమ్యూనిజం వేరు, రష్యా వేరు అన్నారు. మేము భారతదేశం లాగే నిష్పక్ష విధానాన్ని అనుసరిస్తున్నాము. మేము అన్ని దేశాలతోను మైత్రి చేస్తాము. శాంతి కోసం కృషి చేస్తాము. యుద్ధం రాకుండా చూడడానికి, అందరితో కలిసి పని చేస్తాము అని చెప్పారు.

రాబిన్ డే: మధ్య ప్రాచ్యంలో రష్యా బలపడితే, మీకుప్రమాదం ఏమీ లేదా?

నాసర్: మధ్య ప్రాచ్యంలో ఎవరి ఆధిపత్యాన్ని మేము ఆమోదించము.

డే: ఆయుధాలమీద డబ్బు ఖర్చు పెడుతున్న ఒకరు పాశ్చాత్య రాజ్యాలలో మిమ్మల్ని విమర్శిస్తున్నారు. మీరేమి చెబుతారు?

నాసర్: మేము మా దేశాన్ని రక్షించుకోవలసివుంది. ఎవరన్నా దురాక్రమణ చేస్తే, ఎదుర్కొనవలసి వుంది. ఇందులో మీకు తెలియనిది ఏమీ లేదు. మా మీద బ్రిటన్, ఫ్రాన్సు, ఇజ్రాయల్‌లు ఒక్కుమ్మడిగా దండయాత్ర సాగించారు.

శ్రీ నాసర్ తమ ఈగోష్ఠి ప్రారంభంలో బ్రిటన్, ఈజిప్టుల మధ్య సంబంధాలు చెడిపోయినందుకు విచారాన్ని వ్యక్తంచేశారు. తిరిగి ఈసంబంధాలు బాగుపడేటట్లు చూచుకోవలసి వున్నదన్నారు.

రాబిన్ డే: ఈ సంబంధాలు తిరిగి బాగుపరుచుకోవాలని మీకు వున్నదా?

నాసర్: వాకేమిటి? రెండుదేశాలకు వుండాలి. అది ఈ రెండుదేశాల బాధ్యతానూ.

డే: రష్యాదగ్గర జలాంతర్గాములు కొన్నారాట నిజేనా?

నాసర్: కొన్నాము. మొదట, రష్యాతో ఆయుధాల బేరంచేసినప్పుడే, ఈ జలాంతర్గాములు కావాలన్నాము; సైన్యాన్ని, విమానబలాన్ని కట్టుకున్నట్టే, మేము నావా బలాన్నిగూడా నిర్మించుకోవాలిగదా! అందుకు ఈ జలాంతర్గాములు కావాలన్నాము. అయినా మారకి జలాంతర్గాములు వుండరాదని ఎక్కడన్నా వున్నదా యేమిటి?

డే: ఇజ్రాయీలీ నౌకలను దెబ్బతీయడానికి మీరు వీటిని తెప్పించినట్లు ఇజ్రాయల్ భావిస్తున్నది కదా?

నాసర్: మేము ఏమి చేసినా, ఇజ్రాయల్ అట్లాగే చెబుతున్నది. పాశ్చాత్య రాజ్యాలవారిని మోసం చెయ్యడానికి పెద్దగోల, పెద్దప్రచారం, సాగిస్తున్నది. పశ్చిమరాజ్యాలకు, అరబ్ రాజ్యాలకు సంబంధాలు త్రెంచివేసెయ్యాలని ఇజ్రాయల్ ప్రయత్నిస్తోంది. అందుకే ఈగోల అంతాను.

డే: ఇజ్రాయల్ నౌకలను సూయజ్ కాల్వలోకి రానియ్యరు. అంతేగా ఇప్పుడు గూడా మీ విధానం?

నాసర్: ఇక్కడ ఒకమాట చెప్పాలి: ఇజ్రాయీలీ నౌకలను సూయజ్ కాల్వలోంచిపోనియ్యకపోవడం అన్నది ఒక విడి సమస్యకాదు. అఖిలపాలస్తీనా సమస్యలో ఇది ఒకభాగం. పాశ్చాత్య రాజ్యాలవారు, అపాలస్తీనా సమస్య అంతను అట్లావుంచి ఈ ఒక్క సమస్యను పైకి ఎత్తుకున్నారు. కాన్‌స్టాంటినోపుల్ సమాధానం ప్రకారం ఈజిప్టుకు ఆత్మరక్షణకు సంబంధించిన హక్కులు లభించాయి. ఆ ప్రకారమే మేము 1948 నుంచి, ఇప్పటిదాకా, ఇజ్రాయల్ నౌకలను సూయజ్ కాల్వలోకి రానియ్యడం లేదు.

సూయజ్ సమస్యా పరిష్కారానికి ఈజిప్టు నిర్ణయించుకున్న పరిష్కార మార్గాన్ని వివరిస్తూ శ్రీ నాసర్ ఈలా చెప్పారు. "మా పరిష్కార మార్గం ఏమిటో, సమితిలో రిజిస్టరు చేశాము. అది అన్ని విధాలా సమర్థమైనదనే మా భావం. ఈ వ్యవహారంలో ముఖ్య విషయము ఒక్కటే. సూయజ్ కాల్వను రాజకీయాలకు సంబంధం పెట్టరాదు అని. అదే మేమూ కోరుతున్నాము. మా రాజకీయాలు ఈ కాల్వను పట్టరాదనే వారు, తమ రాజకీయాలను మా కాల్వను అసలు పట్టించకూడదు. సహకారంతో అయితే అన్ని పనులుజరుగుతాయి. కాని పెత్తనం చేస్తామంటే ఏదీ జరగదు. సహకారానికి మేము ఎప్పుడూ సిద్ధమే. కాని ఒకరి పెత్తనాన్ని ఆమోదించడం అంటే, మాకు గిట్టదు. ఆ పెత్తనం అంతర్జాతీయమైనదికానీయండి, అగ్రరాజ్యాలపెత్తనం కానీయండి, ఆ అగ్రరాజ్యాలలో ఏదో ఒకదేశం పెత్తనం కానీయండి, ఏ రకమైన పెత్తనాన్ని మేము సహించము.

# రాజీనామాలివ్వాలని గ్రామోద్యోగుల నిర్ణయం

## అనవసరమని మంత్రి వ్యాఖ్య

### జులై 30 లోగా ప్రభుత్వం తాత్కాలిక సహాయం చేయాలని రాష్ట్రసంఘ సూచన

నెల్లూరు, జులై 1: ఆంధ్రరాష్ట్ర గ్రామోద్యోగుల సంఘం రెండురోజులపాటు ఇక్కడ సమావేశమై జులై 30 వ తేదీలోగా తాము కోరినప్రకారం ప్రభుత్వం తాత్కాలిక సహాయం చేయకపోయేపక్షాన గ్రామోద్యోగులు ఉద్యోగాలకు రాజీనామా ఇవ్వాలనీ, ఉద్యోగ పరిస్థితులను బాగు పరిచి, జీతాలు హెచ్చించేంతవరకు జమాబందీ పనులు చూడరాదనీ నిర్ణయించింది.

గ్రామోద్యోగుల సంఘం ఆమోదించిన ఈ తీర్మానంపై వ్యాఖ్యానిస్తూ రాష్ట్ర రివెన్యూమంత్రి శ్రీ కళా వెంకట్రావు గ్రామోద్యోగుల కోరికలను పరిశీలించి నివేదిక సమర్పించేందుకు ప్రభుత్వం ఒక సంఘాన్ని నియమించ దలచిందనీ, త్వరలో ఆ సంఘంలో ఉండే సభ్యుల పేర్లను కూడా ప్రకటించటం జరుగుతుందనీ, ఇలాంటి సమయంలో గ్రామోద్యోగులు త్వరపడి రాజీనామా లివ్వటం మంచిదికాదనీ సలహా ఇచ్చారు.

రాష్ట్రగ్రామోద్యోగుల సంఘ సమావేశం నిన్న పరిసమాప్తమైంది. ఆంధ్ర ప్రాంతంలోని ఏడు జిల్లాలనుంచి దాదాపు 800 మంది ప్రతినిధులు సమావేశానికి హాజరయ్యారు. శ్రీ ఎం. వెంకటస్వామి అధ్యక్షత వహించారు.

ఆంధ్ర ప్రాంతంలో దాదాపు 40 వేలమంది గ్రామోద్యోగులున్నారు. ప్రభుత్వం తమ కోరికలను మన్నించలేదనే కారణంపై వీరిలో కొంతమంది జమాబందిపనులలో పాల్గొనటం లేదు. ప్రస్తుతం తమకిస్తున్న జీతాలను హెచ్చించాలనీ, ఉద్యోగపరిస్థితులను బాగుపరచాలనీ, విధుల నిర్వహణకు అవసరమయ్యే కాగితాలు వగైరా వాటిని సరఫరా చేయాలనీ వీరు కోరారు.

కోరికలను మన్నించక పోయే పక్షాన ఉద్యోగాలకు రాజీనామా ఇవ్వాలని సంఘం చేసిన నిర్ణయం తెలంగాణా ప్రాంతంలోని గ్రామోద్యోగులకు వర్తించదు. అక్కడివారికి ప్రభుత్వం ఇచ్చే ప్రతిఫలం వేరే విధానం మీద ఆధారపడి ఉంది. భూమి శిస్తు వసూలునుబట్టి వారికి కమీషన్ ఇస్తారు.

రాష్ట్ర రివిన్యూ మంత్రి పత్రికా ప్రతినిధులతో ప్రసంగిస్తూ గ్రామోద్యోగులకు కావలసిన కాగితాలు వగైరా వస్తువులను సరఫరా చెయ్యటానికి ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసిందనీ, వారు జమాబంది పనులలో పాల్గొనలేకపోతే సహించి వూరుకోవటం జరగదనీ వివరించారు. గ్రామోద్యోగు లెవరైనా తమ ఉద్యోగాలకు రాజీనామాలు పంపినట్లయితే వాటిని ఆమోదించవలసిందని కలెక్టర్లను ఆదేశిం[illegible]ను నిపుడు శ్రీ వెంకట్రావు తెల[illegible]

రాష్ట్ర గ్రామో[illegible]ల సంఘం 20వ వార్షిక మహాసభ ఆ[illegible]ఏ తేదీన ప్రదేశ్ కాంగ్రెసు ఉపాధ్యక్షుడు శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డి అధ్యక్షతను జరిగింది. సభను శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డి ప్రారంభించారు. శ్రీయుతులు కేశాల లక్ష్మీనరసారెడ్డి, జి. సి. కొండయ్య, మండలి వెంకటస్వామి ప్రభృతులు ప్రసంగించారు. శ్రీ జి. సి. పద్మనాభరాజు పద్యాలుచదివారు. సభికులకు, అహూతులకు శ్రీ నల్లపరెడ్డి చంద్రశేఖరరెడ్డి స్వాగతం చెప్పారు. శ్రీ ఇలపర్తి వెంకటరత్నం వార్షిక నివేదిక సమర్పించారు.

శ్రీ రామచంద్రారెడ్డి తమ ప్రారంభోపన్యాసంలో గ్రామోద్యోగుల పరిస్థితిని పరిశీలించి వీరు ఓరిమితో ఆందోళన జరిపి తమ కోరికలను ప్రభుత్వం చేత ఆమోదింపచెయ్యాలని సలహా చెప్పారు.

శ్రీ జి. సి. కొండయ్య గ్రామోద్యోగుల ఉద్యమ లక్ష్యాలను, వారు అనుసరిస్తున్న పద్ధతులను ప్రశంసించారు. ప్రభుత్వం లోటు బడ్జెటు పేరుతో వీరి కోరికలలో కొన్నింటనైనా ఆమోదించకపోవటం సబబుకాదని శ్రీ లక్ష్మీనరసారెడ్డి విమర్శించారు.

సంఘం నూతన కార్యవర్గానికి దిగువ సభ్యులు ఎన్నికయ్యారు: శ్రీయుతులు ఎన్. వెంకటప్పన్న పట్నాయక్ (అధ్యక్షుడు), నల్లపరెడ్డి చంద్రశేఖర రెడ్డి (ఉపాధ్యక్షుడు), బి. వెంకటరత్నం (కార్యదర్శి), కె. వెంకటకృష్ణమూర్తి (సహాయ కార్యదర్శి), ఎం. తిరుపతిరావు (ప్రచార కార్యదర్శి), కె. రెడ్డినాయుడు, పి. సూర్యనారాయణ పట్నాయక్, ఎ. ప్రసాదరావు, ఎం. గౌరీనాయుడు, ఎస్. సత్యనారాయణమూర్తి, కె. కోదండరాజు, ఇ. వెంకటరత్నం, వి. భాస్కరరావు, ఎం. వెంకటస్వామి, డి. సీతారామారావు, వి. నరసింహారావు, ఎం. తిరుపతిరావు, ఎం. వెంకటేశ్వరరావు, టి. రాజగోపాలరెడ్డి (సభ్యులు).

కార్యాచరణ సంఘానికి దిగువ సభ్యులు ఎన్నికయ్యారు. శ్రీయుతులు ఎన్. వెంకటప్పన్న పట్నాయక్, బి. వెంకటరత్నం, ఎం. వెంకటస్వామి, డి. నరసింహమూర్తి, కె. వీరభద్రరావు, జి. సింహాద్రిరావు, బి. వెంకటేశ్వరరావు.

# రాయలసీమ సంఘం నిర్ణయం

రాయలసీమ గ్రామోద్యోగుల సంఘం జూన్ 30 వ తేదీన అనంతపురంలో శ్రీ మూలెపల్లి సంజీవరెడ్డి అధ్యక్షతను సమావేశమై ప్రభుత్వం తాత్కాలిక సహాయం చెయ్యకపోతే గ్రామోద్యోగులు తమ పదవులకు రాజీనామా లివ్వాలని తీర్మానించింది.

సమావేశాన్ని శాసనసభ్యుడు శ్రీ పి. రామాచార్యులు ప్రారంభించారు. దాదాపు రెండువందలమంది ప్రతినిధులు హాజరయ్యారు. ఆహ్వాన సంఘాధ్యక్షుడు శ్రీరామచంద్రారెడ్డి సభికులకు స్వాగతం చెప్పి సమావేశ ఆశయాలను వివరించారు.

సభాధ్యక్షుడు తమ ప్రసంగంలో గ్రామోద్యోగుల న్యాయమైన కోరికలనుకూడా ప్రభుత్వం తీర్చకపోవటం శోచనీయమని విమర్శించారు.

శ్రీ ఆర్. వెంకటరమణప్ప వందన సమర్పణం చేశారు.

# హైదరాబాదు స్టేట్ బ్యాంకులో చోరీ ప్రయత్నం

## పోలీసుల జాగ్రత్త ఫలితంగా ఇద్దరి అరెస్టు

హైదరాబాదు, జూలై 2: హైదరాబాదు నగర పోలీసుల జాగ్రత్త ఫలితంగా — బ్యాంకు కౌంటర్లవద్ద దొంగతనాలు చేసే — ఇద్దరు దొంగలు స్టేట్ బ్యాంకు ఆవరణలో ఇవాళ అరెస్టయినారు.

పబ్లిక్ వర్క్సుశాఖ ఉద్యోగులకు జీతాలు ఇచ్చేందుకు రు. 9 వేలు తీసుకు వెళ్ళేందుకు స్టేట్‌బ్యాంకుకు పబ్లిక్ వర్క్సుశాఖ కాషియర్ శ్రీ రామగోపాలరెడ్డి వచ్చాడట. ఆయన బ్యాంకు కౌంటరువద్ద నోట్లకట్టలను లెక్క పెడుతూండగా ఓంప్రకాశ్, శంకర్ అనే ఇద్దరు అక్కడికి వచ్చారట. వాళ్ళఇద్దరి వ్యవహారాన్ని శ్రీయుతులు నరసింహా, మొహసీన్ అనే పోలీసు ఉద్యోగులు కనిపెడుతూనే ఉన్నారు.

ఓంప్రకాశ్ తన చెప్పులలో కొన్ని నోట్లూ, కొన్ని కాగితాలూ దూర్చాడు. రామగోపాలరెడ్డి రూపాయల నోట్లను లెక్కపెడుతున్నపుడు ఆ నోట్లనూ, కాగితాలనూ ఓంప్రకాశ్ జారవిడిచాడు. ఓంప్రకాశ్ సినిమావ్యగానే రామగోపాలరెడ్డి దగ్గరకి శంకర్ వెళ్ళి "అయ్యా మీ డబ్బులు కిందపడిపోయినవి" అని చెప్పాడు. ఆ డబ్బులు తీసుకోడానికి రామగోపాలరెడ్డి వంగగానే కౌంటరుమీదవున్న రూపాయలనోట్లను ఓంప్రకాశ్ చేజిక్కించుకుని పారిపోవడానికి ప్రయత్నించాడు. అంతలో వాళ్ళ ఇద్దరినీ శ్రీయుతులు నరసింహా, మొహసీన్ అరెస్టుచేసి కేంద్ర నేర విభాగ పోలీసు కేంద్రానికి తీసుకు వెళ్ళారు.

నగరంలోని ఒక బ్యాంకులో కొన్నాళ్ళకిందట ఇట్లాగే పట్టపగలు దొంగతనంచేయడానికి ప్రయత్నించగా సహాబ్ అలీని పోలీసులు అరెస్టుచేసిన సంగతి పాఠకులకు తెలిసినదే.

# మధ్య ప్రదేశ్ సభాపతిగా కుంజీలాల్ దూబే ఎన్నిక

భోపాల్, జులై 2: మధ్య ప్రదేశ్ విధాన సభ సభాపతిగా శ్రీకుంజీలాల్ దూబే ఏకగ్రీవంగా ఎన్నిక అయినారు.

పదో వా యకుడు డా॥ కైలాస్ నాథ్ కట్జూ, ప్రతిపక్ష సభ్యులు, శ్రీ దూబేను అభినందించారు.

# విదేశాలకు అమెరికా సహాయం

## ఐక్ అడిగిన దానిలో 60 కోట్ల డాలర్లకోత

వాషింగ్టన్, జూలై 1: ప్రజా ప్రతినిధి సభ విదేశ వ్యవహారాల సంఘం, 324 2383000 డాలర్లను విదేశాలకు సహాయంగా ఇచ్చేబిల్లును యివాళ ఆమోదించింది. బిల్లుకు అనుకూలంగా 22 మంది వ్యతిరేకంగా ఆరుగురు ఓటు చేశారు. ఈమొత్తం అధ్యక్షుడు శ్రీ ఐసెన్‌హోవరు అడిగిన దానికంటె 60 కోట్ల డాలర్లు తక్కువ.

శ్రీ ఐసెన్‌హోవర్ సంకల్పించిన దీర్ఘకాలిక సహాయ కార్యక్రమానికి అనుకూలంగా యీసంఘం కొన్ని మార్పులుచేసింది. విదేశాలలో ఆర్థికాభివృద్ధి కృషి చురుకుగా సాగేట్లు, ఋణాలు యిచ్చేందుకు 150 కోట్ల డాలర్లతో మూడేళ్ళపాటు నిధి స్థాపించాలని, యీసంఘం నిశ్చయించింది. అనుకూలంగా 17 గురు ప్రతికూలంగా 10 మంది ఓటుచేశారు.

వెనుకబడిన దేశాలకు వచ్చే ఆర్థిక సంవత్సరంలో సాంకేతిక సహాయం కోసం 1519 లక్షల డాలర్లను మామూలు ఆర్థిక సహాయం నిమిత్తం 2750 లక్షల డాలర్లను (ఐసెన్‌హోవర్ అడిగిన దానికంటె 250 లక్షలు తక్కువ) మంజూరుచేసింది.

బహుశః వచ్చే వారం యీబిల్లు ప్రజాప్రతినిధి సభకురావచ్చునని యీ సంఘం అధ్యక్షుడు థామస్ గార్డన్ తెలియజేశారు.

# దిగుమతి నిర్బంధాల సడలింపు

## అనేక దేశాల నిర్ణయం

జెనీవా, జులై 1: దిగుమతులపై ప్రస్తుతం ఉన్న నిర్బంధాలను సడలించడానికి అనేక దేశాలు నిర్ణయించుకొన్నాయి. అంతర్జాతీయ వ్యాపారానికి దిగుమతి సుంకాలకు సంబంధించిన ఒప్పందం ప్రకారం యిక్కడ మూడు వారాలుగా జరుగుతున్న సమాలోచనల సందర్భంలో తమ నిర్ణయాన్ని ప్రకటించాయి.

ఇవాళ వెలువడిన అధికార ప్రకటనలో ఇలా ఉంది.

"డాలర్ ప్రాంతం నుంచి దిగుమతి అయ్యే వాటిల్లో 17 ముఖ్యమైన వస్తువులకుదిగుమతి అనుమతులక్కాయిదా లేకుండా స్వీడన్ చేస్తున్నది. ఇది. ఇవాళ నుంచి అమలులోకి వస్తుంది

దిగుమతులపై నిర్బంధాలను, త్వరలో యింకా కొంత సడలిస్తామని నార్వే తెలియ పరచింది.

డాలర్ ప్రాంతం నుంచి స్వేచ్ఛగా దిగుమతి చేసుకొనే వస్తువుల సంఖ్య హెచ్చించడానికి చర్యతీసుకొంటున్నట్లు ఇటలీ వెల్లడించింది. ఆస్ట్రియా కూడా డాలర్ ప్రాంతం నుంచి యుథేచ్ఛగా దిగుమతి చేసుకొనే వస్తువుల కొత్త జాబితా ప్రకటించింది. ఇది జులై మధ్య నుంచి అమలులోకి వస్తుంది.

# అంచెలవారీగా నిరాయుధీకరణ

(1 వ పుట తరువాయి)

రాజ్యాలు కూడా అణ్వస్త్రాలు నిర్మించడం ప్రారంభించక ముందే, ఏదో విధాన ఏదో ఒక ఒప్పందం కుదుర్చుకోవాలని రష్యా ఆత్రుతతో ఉన్నదని శ్రీ లాయిడ్ అభిప్రాయం.

ఇతర రాజ్యాలు కూడా అణ్వస్త్రాలు నిర్మించడం మొదలు పెడితే, ఇప్పటికే ఒప్పందం కుదరడం కష్టంగా కనపడుతున్న నిరాయుధీకరణ సమస్య మరింత క్లిష్టమై పోతుంది.

నిరాయుధీకరణ సమస్యను కామన్వెల్త్ ప్రధాన మంత్రుల సమావేశం చర్చించడం ఇది రెండవసారి. మొదటి సారి, సమావేశం ప్రారంభం రోజున, బుధవారం నాడు చర్చించారు.

అట్లాంటిక్, బాగ్దాద్, మనిలా కూటాల ద్వారా బ్రిటన్‌తో సైనిక సంబంధం కల రాజ్యాల ప్రతినిధులు ఇవాళ మధ్యాహ్నం సమావేశమై, దేశరక్షణ సమస్యలను చర్చించవలసినది, జరుగలేదు; అది రేపు మధ్యాహ్నానికి వాయిదా వేశారు.

# బ్రిటిష్ ప్రధానితో నెహ్రూ గోష్ఠి

లండన్, జూలై 1: భారత ప్రధాని శ్రీ నెహ్రూ ఇవాళ మధ్యాహ్నం బ్రిటిష ప్రధాన మంత్రి శ్రీ హెరాల్డ్ మాక్మిలన్‌ను వారి కార్యాలయంలో కలుసుకుని రెండుగంటలసేపు మాట్లాడారు. వీరి గోష్ఠి మధ్యాహ్నం 3 గంటలకు ప్రారంభమయింది. గోష్ఠికి శ్రీ నెహ్రూ ఒక్కరే వెళ్ళారు.

క్రిందటి శుక్రవారం నాడు బ్రిటిష్ ప్రధాని నివాస భవనం "చెకర్స్"లో శ్రీ నెహ్రూ వారితో విడిగా మాట్లాడి ఉన్నారు.

శ్రీ నెహ్రూను ఇవాళ మధ్యాహ్నం, పూర్వ బ్రిటిష దేశరక్షణ మంత్రి లార్డ్ మౌంట్‌బాటన్ కలుసుకుని మాట్లాడారు.

శ్రీ మౌంట్‌బాటన్ క్రిందటి గురువారం నాడు, పాకిస్తాన్ ప్రధాని శ్రీ సుహ్రావర్దీని కలుసుకుని మాట్లాడారు.

శ్రీ నెహ్రూ ఇవాళ మధ్యాహ్నం కెనడా ప్రధాని శ్రీ డైఫెన్ బేకర్ బసలో ఆతిథ్యం స్వీకరించారు.

'టైమ్స్' పత్రిక డైరెక్టర్ సర్ కాంఫెబెల్ స్టువర్ట్, అంతర్జాతీయ పత్రికా సంస్థ (జూరిచ్) డైరెక్టరు డా॥ జె. బి. రోజ్ కూడా ఇవాళ శ్రీ నెహ్రూను కలుసుకున్నారు.

# లాయిడ్‌తో మీనన్ గోష్ఠి

భారత దేశ రక్షణ మంత్రి శ్రీ వి. కె. కృష్ణమీనన్ నిన్న సాయంకాలం బ్రిటిష్ విదేశాంగ మంత్రి శ్రీ సెల్విన్ లాయిడ్‌ను కలుసుకుని మాట్లాడారు.

కామన్వెల్త్ ప్రధానుల సమావేశం అనంతరం, శ్రీ మీనన్‌లండన్ నుంచి వెళ్ళిపోయేలోగా, నిరాయుధీకరణ ఉపసంఘంలోని అమెరికా ప్రతినిధి శ్రీ హెరాల్డ్ స్టాసెన్‌ను కలుసుకుంటారని తెలుస్తున్నది.

నిన్న సాయంకాలం శ్రీ మీనన్‌కు యూరప్‌లోని కాశ్మీరీల సంఘం విందు చేసింది. ఈ సంఘానికి అధ్యక్షులు డా॥ హెచ్. కె. హాండూ. విందు కార్యదర్శి శ్రీ యల్. జుట్షీ నివాసంలో జరిగింది.

# యూరప్ స్వేచ్ఛా వ్యాపార వ్యవస్థ

## కామన్వెల్త్ ఆర్థిక అధికారుల సమావేశం

లండన్, జూలై 1: యూరోపియన్ పారిశ్రామిక స్వేచ్ఛావ్యాపార వ్యవస్థ పథకాన్ని వివరంగా చర్చించడానికి, కామన్వెల్తు రాజ్యాల ఆర్థిక శాఖల ఉన్నతాధికారులు, నిపుణుల సమావేశం ఏర్పాటయింది.

ఈ పథకాన్ని, కామన్వెల్తు రాజ్యాల ఆర్థిక, వ్యాపార సమస్యలనూ, కామన్వెల్తు ప్రధానమంత్రుల సమావేశం బుధవారంనాడు స్థూలంగా చర్చించనున్నది.

ఈ చర్చలలో ప్రధాన మంత్రులు ఇతర ప్రతినిధులకు తోడ్పడ్డానికి వచ్చిన ఆర్థికశాఖల ఉన్నతాధికారులు ప్రధానుల సమావేశం అనంతరం మరి కొన్నిరోజులు లండన్‌లో ఉండిపోయి, యూరోపియన్ పథకాన్ని వివరంగా చర్చిస్తారు.

ఈ అధికారులూ నిపుణుల చర్చలు ఎప్పుడు ప్రారంభమౌతాయో తేలియదు, కాని సుమారు మూడురోజులు జరగవచ్చని తెలుస్తున్నది.

ప్రధానుల సమావేశంలో శ్రీ నెహ్రూకు తోడ్పడ్డానికి, తరువాత ఆర్థిక శాఖాధికారుల సమావేశంలో పాల్గొనడానికి, భారతదేశంనుంచిఆర్థిక శాఖ ముఖ్యకార్యదర్శి శ్రీ హెచ్. యం. పటేల్ ఇవాళే లండన్ చేరుకున్నారు.

భారతదేశపు ద్వితీయ పంచవర్ష ప్రణాళికకోసం, బ్రిటన్‌లో పరపతి సహాయం ఏమాత్రం లభిస్తుందో పరిశీలించడానికికూడా శ్రీ పటేల్ వస్తున్నట్లు, భారతదేశంనుంచి వార్తలు వస్తున్నవి.

పాకిస్తాన్ తరఫున ఆర్థిక శాఖాధికారుల సమావేశంలో, పాకిస్తాన్ ఆర్థిక వ్యవహారాలశాఖ కార్యదర్శి శ్రీ యస్. ఏ. హాసనీ పాల్గొంటారు.

ఫ్రాన్స్, పశ్చిమ జర్మనీ, ఇటలీ, బెల్జియం, హాలండ్, లగ్జెంబర్గ్, బ్రిటన్‌లు యూరోపియన్ పారిశ్రామిక స్వేచ్ఛా వ్యాపారవ్యవస్థ నెలకొల్పడానికి కృషిచేస్తున్నాయి. అప్పుడే కొన్ని కామన్వెల్త్ రాజ్యాలు ఈ పథకంపట్ల సిద్ధాంతరీత్యా సుముఖభావం తెలియపరిచాయి.

# 75 మైళ్లు పైకి అమెరికన్ రాకెట్

## సూర్యగోళంలో కల్లోలం పరిశీలించడానికి

శాన్‌నికోలాస్ ద్వీపం (కాలిఫోర్నియా), జూలై 1: సూర్యగోళంలో ప్రేలుళ్లు, కల్లోలాలను పరిశీలించడానికి తగు యంత్ర పరికరాలతో సహా, భూవిజ్ఞాన పరిశోధన (1957) కార్యక్రమం ఉపక్రమణికగా ఇవాళ మొట్టమొదటి రాకెట్టును, అమెరికా నావికా దళం వియత్పథంలో 75 మైళ్ల ఎత్తుకు పంపింది.

అమెరికా పసిఫిక్ తీరానికి 60 మైళ్ళలో ఉన్న ఈ ద్వీపంనుంచి ఆకాశంలోకి పంపనున్న 14 రాకెట్లలో ఇది మొదటిది.

20 అడుగుల పొడవు, 1500 పౌనుల బరువుకల ఈ రాకెట్ దిగువ తొడుగు కొంత ఎత్తు ఎగిరి, అసలు రాకెట్‌ను అక్కడనుంచి పైకి పంపి, అది ఒక్క డజను మైళ్ళ దూరంలో సముద్రంలో పడిపోయింది.

# హంగరీపై సమితి చర్చ సెప్టెంబరులో ఏర్పాటు

న్యూయార్కు, జులై 1: హంగరీపై సమితి సంఘం సమర్పించిన నివేదికను చర్చించడానికి సమితి ప్రత్యేక సర్వసభ్య సమావేశం 1957 సెప్టెంబరు 10 తేదీని ప్రారంభం కావచ్చునని బ్రిటిష్ వర్గాలవారు తెలుపుతున్నారు. అంటే సమితి సాధారణ సమావేశం జరగడానికి ఒక వారం ముందుగా నన్నమాట.

అయితే, హంగరీలో పరిణామం దృష్ట్యా అవసరంపడితే, ఈ లోగానే జరక్కపోదు అన్నారు.

సాధారణ సంఘాన్ని సంప్రదించి సమావేశం తేదీ నిర్ణయించవలసిన సమితి అధ్యక్షులు వాన్ వైదేయికన్ రాడునూరిని (ఫిలిప్పైన్సు ప్రతినిధి) వద్దనుంచి కబురుకోసం నిరీక్షిస్తున్నట్లు బ్రిటిషు వర్గాల వారు చెప్పారు.

# సమితి సైన్యాధిపతి రాజీనామా వార్త అసత్యం

న్యూయార్కు, జులై 1: సమితి కార్యదర్శి శ్రీ హామర్‌షెల్డ్‌తో విభేదాల మూలంగా సమితి సైన్యాధిపతి మేజర్ జనరల్ ఇ. యల్. యం. బర్న్స్ రాజీనామా ఇచ్చే విషయం ఆలోచిస్తున్నారని, ఇజ్రేలీ పత్రికా వార్తలో నిజంలేదని, సమితి అధికార వర్గాల వారు చెపుతున్నారు.

శ్రీ హామర్‌షెల్డ్ ప్రస్తుతం యూరప్‌లో సెలవులో ఉన్నారు.

# అంతరిక్ష వాతావరణ పరిశీలనలు

వాషింగ్టన్, జులై 1: భూమి మట్టానికి 20 మైళ్ళకు పైన అంతరిక్షం (స్ట్రాటో స్ఫియర్) లోని వాయు పవనాలను నౌకాదళపు రాకెట్లు అన్వేషిస్తున్నాయి. ఈ రాకెట్లు మామూలు విదు అంగుళాల నౌకా ఫిరంగినుంచి పోయినవి. అంతరిక్షంలోని ధ్వనులను బట్టి భూమి ఉపరిభాగపువాతావరణ స్థితిగతులను గురించి జోస్యం చెప్పడానికి సంబంధించిన ముఖ్య సమాచారాన్ని కనుగొనగలమని నౌకా శాఖవారు ఆశిస్తున్నారు.

# మటుమాయమైన పాక్ విమానం

## ప్రయాణీకులంతా క్షేమం

కరాచీ, జులై 2: నిన్న చిట్టగాంగ్ నుండి ఢాక్కాకు బయలుదేరి మధ్యలో మాయమైన విమానం, ఒకచోట బలవంతంగా దిగిపోయిందనీ, విమానంలోని మొత్తం 24 గురు ప్రయాణీకులు క్షేమంగా ఉన్నారనీ, పాకిస్తాన్ అంతర్జాతీయ విమానసంస్థ యివాళ ప్రకటించింది.

# శ్రీ బి. యం. చినాయ్ గౌరవార్థం విందు

మద్రాసు, జూన్ 30: భారతీయ వాణిజ్య సంఘాల సమాఖ్య అధ్యక్షుడు శ్రీ బి.యం. చినాయి గౌరవార్థం హిందూస్థాన్ వాణిజ్య సంఘాధ్యక్షుడు శ్రీ సి. వి. చెట్టియార్ జూన్ 29 వ తేదీ మధ్యాహ్నం కన్నిమారా హోటలులో విందు చేశారు. మేయరు శ్రీ కె. యస్. శ్రీనివాసన్, దక్షిణ భారత వాణిజ్య సంఘాధ్యక్షుడు శ్రీ కె. యస్. జి. హాజాషెరిఫ్, ఆంధ్ర వాణిజ్య సంఘాధ్యక్షుడు శ్రీ బి. వేణుగోపాల్ ప్రభృతులు విందుకు హాజరైనారు.

# పాక్ ప్రధాని జోర్డాన్ సందర్శనం

లండన్, జూలై 1: పాకిస్తాన్ ప్రధాని శ్రీ సుహ్రావర్దీ ఈ మాసంలో జోర్డాన్ రాజధాని అమ్మాన్ దర్శించగలరని, పాకిస్తాన్ అధికారి ఒకరు ప్రకటించారు. శ్రీ సుహ్రావర్దీని జోర్డాన్ రాజు శ్రీ హుస్సేన్ ఆహ్వానించారు.

పాకిస్తాన్ ప్రధాని పదిరోజుల అమెరికా సందర్శనం అనంతరం స్వదేశం వెళ్లేదారిలో అమ్మాన్‌లో దిగి రెండు మూడు రోజులుంటారు.

పాకిస్తాన్ ప్రధానమంత్రి అయినవారు జోర్డాన్ దర్శించడం ఇదే మొదటి సారి.

## ఆంధ్ర మెడికల్ కాలేజీలలో ప్రవేశము

ప్రత్యేక సందర్భములలో 16 సం॥లు పూర్తిచేసియుండి 17 సం॥లు నిండకుండా వున్న అభ్యర్థుల దరఖాస్తుల విషయమై కూడా ఆలోచింపవలసినదిగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఉత్తర్వులు యిచ్చియున్నారు. కాబట్టి పై ఉత్తర్వుల ననుసరించి దరఖాస్తులు చేయదలచుకొన్న అభ్యర్థులు ఆంధ్రమెడికల్ కాలేజి ప్రిన్సిపాల్ వారికి 0.75 నయాపైసలు స్వయంగా లేక ఎం. ఓ. ద్వారా చెల్లించి ఫారములు పొందవలెను. ఎం. ఓ. కూపనులో తమ అడ్రసు వివరముగా వ్రాయవలెను. పూర్తిచేసిన డాకుమెంటులతో యిట్టి దరఖాస్తుదార్లు సెలెక్షన్ కమిటీముందు గుంటూరు నందలి గుంటూరు మెడికల్ కాలేజీలో 11-7-1957 తేదీన ఇన్‌టర్వ్యూకు హాజరు కావలెను.

ప్రిన్సిపాల్,
ఆంధ్ర మెడికల్ కాలేజి, విశాఖపట్నం.

---

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం
సివిల్ సప్లయిల డైరెక్టరు కార్యాలయం
హైద్రాబాదు-దక్కన్

విషయము :-దఫాకు వందగోనె సంచుల చొప్పున మామూలు ఆచారం ప్రకారం వేలం-టెండరు పద్ధతిలో అమ్మకం.

## ప్రకటన

సివిల్ సప్లయిల శాఖకు చెందిన నగరంలోని గోడవునులలో నిల్వవున్న వివిధ రకాలకు చెందిన సుమారు 1,73,265 గోనె సంచులు, బి. ట్విల్లు, డి. డబ్ల్యు. షెలికలు 8-7-57 సా. 3 గంటలకు హైదరాబాదు సైఫను రోడ్‌లోగల సివిల్ సప్లయిలశాఖ డైరెక్టరు కార్యాలయంలో బహిరంగ వేలం ద్వారా అమ్మబడును. గోనెసంచులలో మంచివి, రిపేరు చేయదగినవి, పనికిరానివి రిపేరుచేయ వీలులేనివి కూడా వున్నవి.

7-7-1957 వ సా. 3 గంటలకు సివిల్ సప్లయిల అసిస్టెంటు డైరెక్టరు-(1)-(బి 2-ఆహార విధానం)-గారి చేత సీలువేయబడిన ప్రత్యేక టెండర్లు కూడా స్వీకరించబడును. టెండర్లలో ఏ విధమైన షరతులు విధించబడి వుండకూడదు. వుంటే అవి పరిశీలించబడవు.

ముందుగా రు. 5000 లు ధరావత్తు చెల్లించి, వేలం ప్రారంభమయ్యే ముందు రసీదు చూపించనిదే ఏ వ్యక్తి కాని టెండరు ఇచ్చుటకుగానీ, వేలంలో పాటపాడుటకుగానీ, వేలం వద్ద హాజరై వుండుటకుగానీ అనుమతించబడదు. టెండరు విషయములో ఐతే, యీ ధరావతు హైదరాబాదు సైఫన్ రోడ్డులోని సివిల్ సప్లయిల శాఖ చీఫ్ అకౌంట్సు ఆఫీసరుకు చెల్లించి, రసీదు టెండరుతో జతపరచవలెను. వేలం పాటలో పాల్గొనగోరేవారు, ధరావతును వేలం నిర్వహిస్తున్న అధికారికే చెల్లించవచ్చు.

టెండర్లు పంపుతున్నవారు, మళ్ళీ ధరావతు చెల్లించకుండానే వేలంలో పాట పాడవచ్చు.

కొనుగోలుదారుగా ప్రకటించబడిన వ్యక్తి, అట్టి ప్రకటన జరిగిన వెంటనే కొట్టివేయబడిన పాట మొత్తములో ¼ భాగం చెల్లించవలెను. తరువాత, యీ సందర్భంలో అమలులోగల షరతుల వివరాల ననుసరించి, అగ్రిమెంటు బాండును కూడా వ్రాసి ఇవ్వవలెను. సదరు అగ్రిమెంటు వ్రాసి ఇవ్వకపోయినా, డబ్బు చెల్లించకపోయినా, వెంటనేగానీ, తరువాతనైనా ఒక రోజునగానీ, సరుకు తిరిగి వేలం వేయబడుతుంది. లేక తిరిగి విక్రయించబడుతుంది. దీనివల్ల కలిగే ఏవిధమైన నష్టానికైనా మొదటి కొనుగోలుదారే బాధ్యత వహించవలసివుంటుంది.

పైన వివరింపబడిన బర్దానా నిలువలు వాటిని హైద్రాబాదు సివిల్ సప్లయిస్ శాఖకు చెందిన నగర గిడ్డంగులలో కావలసినవారి నిమిత్తం పరిశీలనకు ఉంచబడినవి.

అమ్మకం మొదలగువాటికి సంబంధించిన షరతుల వివరములను హైద్రాబాదు సివిల్ సప్లయిస్ డైరెక్టరు-బి. 2, ఫుడ్‌పాలసీ-డి స్పెషల్ సెక్షన్-కార్యాలయానికి స్వయంగా వెళ్లి తెలుసుకోవచ్చును.

సం. డైరెక్టరు,
సివిల్ సప్లయిస్.

---



---

మిషనరీ అమ్మకము

క్రాసలీ హెవీ ఆయిల్ ఇంజను
F. O. I. టైపు, కోల్డుస్టార్టర్, డబుల్ ప్లైవీలు, H. P. 26-28½
రస్సెల్ న్యూబెరీ ఇంజను
H.P.7-10 రెండున్నూ చక్కగా పనిచేయుచున్నవి. వెంటనే అమ్మబడును. వివరములకు:- K. Narayanaswamy Naidu, Rice & Flour Mills, Tenneri (Near Walajabad,) Kancheepuram Tq.

---

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము

1951 మద్రాసు హిందూమత ధర్మాదాయ సంస్థల చట్టంక్రింద ప్రకటన

G. O. Ms. No. 669/17-6-57.

క్రింది షెడ్యూలులో స్పష్టీకరించిన ప్రకారం కృష్ణాజిల్లా, బెజవాడలో "శ్రీ నందిపాటి వాసయ్య ధర్మసత్రం." అని పిలువబడే ధర్మాదాయసంస్థ పరిపాలన యీ క్రింది షెడ్యూలులో వివరించిన ప్రకారం సక్రమంగా లేదని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి విన్నపాలు వచ్చినందుననూ;

సదరు ధర్మాదాయ సంస్థ సక్రమముగా పరిపాలింపబడుట లేదని ప్రభుత్వము వారు నమ్ముటకు తగిన కారణము లున్నందుననూ;

సదరు ధర్మాదాయసంస్థ పరిపాలనా శ్రేయస్సు కొరకు, 1951 మదరాసు హిందూమత, ధర్మాదాయముల చట్టము (మద్రాసుఆక్టుXIXఆఫ్1951)యొక్క అన్ని షరతులున్నూ సదరుచట్టము క్రింద చేసిన నిబంధనలున్నూ, పై సంస్థకు వర్తింప జేయవలసిన అవసర మున్నట్లు ప్రభుత్వము తృప్తిపడి ఉన్నందుననూ;

సదరు చట్టములోని 3 (1) సెక్షను వలన సంక్రమించిన అధికారమును బట్టి ఆంధ్ర రాష్ట్ర గవర్నరు సదరు చట్టములోని అన్ని షరతులున్నూ, దాని ననుసరించి చేసిన నిబంధనలున్నూ యీ ధర్మాదాయ సంస్థకు వర్తింపజేయ తలచుచున్నందుననూ;

ఇప్పుడు, సదరు చట్టములోని సెక్షన్ 3 (1) షరతు ననుసరించి, సదరు ధర్మాదాయ సంస్థతో సంబంధంగల వారందరికిన్నీ యీ నోటీసు మూలకముగా పై ధర్మాదాయ సంస్థకు పైచట్టములోని షరతులన్నియూ, మరియు దాని ననుసరించి చేసిన నిబంధనలన్నియూ యేల వర్తింపజేయరాదో 1957, సెప్టెంబరు 20 తేదీనగాని లేక ఆలోపుగాగాని తెలుపుకొనవలసినదిగా తెలియజేయడమైనది.

సదరు తేదీలోగా గానీ, లేదా ఆ తేదీని గానీ దాఖలైన పిటిషనులను సెక్రటరీ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము, సాంఘిక సంక్షేమ కార్మిక శాఖ, హైద్రాబాద్ ఆంధ్రప్రదేశ్ వారు ఆలోచిస్తారు.

(గవర్నరు ఉత్తరువులో)
ఎఫ్. డి. పెస్టన్‌జీ,
ప్రభుత్వ డిప్యూటీ సెక్రటరీ.

షెడ్యూలు

(1) బ్రాహ్మణ యాత్రీకులకు ఉచిత భోజన వసతియు, హిందూ యాత్రీకులకు నివాస సౌకర్యమును, ట్రస్టు ఉద్దేశ్యము ప్రకారము, ప్రస్తుత ట్రస్టీ సక్రమముగా నెరవేర్చుటలేదు.

(2) సత్రము నుండియు, సత్రం షాపుల నుండియు వచ్చే ఆదాయమును, యీధర్మసంస్థాపకుడు 1924 మరణించి నదాది 1928 ఆగస్టులో విధిలేక ట్రస్టు నిబంధనలను అమలు జరుపవలసివచ్చేంత వరకు ప్రస్తుత ట్రస్టీ దుర్వినియోగము చేస్తుండెను.

(3) ప్రస్తుత ట్రస్టీ ట్రస్టుయొక్క నికరాదాయమును మరుగుపర్చవలెననే ఉద్దేశ్యముతో సత్రం షాపులను పాత అద్దెదార్లకూ రెల్లప్పుడు అనుమానింప తగినంత తక్కువ రేట్లకు అద్దె ఖరారు నామాలు లేకుండా 30-11-1947 వరకు యిస్తూండి, అప్పైన శ్రీమతి సాకల సూర్యంకు అద్దె నిర్ణయం లేకుండా యిస్తూండినది. మరియు 3 వ షాపు 30-4-33 నుండి 9-9-34 వరకు ఖాళీగా వున్నట్లు చూపబడినది.

(4) సుమారు 8,000/- వరకు రావలసిన అద్దె బాకీలు వసూలు పర్చుటకు ట్రస్టీ యెట్టి చర్యలను తీసుకొనలేదు.

(5) ట్రస్టును తొలగించి తానే పూర్తి లాభం పొందవలెననే ఉద్దేశ్యముతో, చట్ట విరుద్ధముగా అతిస్వల్ప విలువయగు రు. 14000/- కు శ్రీ గొందుపల్లి సింహాచలమునకు 12-12-1945 తేదీన ఒక చట్టవిరుద్ధమైన అగ్రిమెంటు వ్రాసియిచ్చి 7-12-47 వరకు అందుకు ప్రతిఫలముగా రు. 8,000 పొందినది.

(6) ఎండోమెంటు అభివృద్ధికి ఆటంకముగా, మిగిలిన ఎండోమెంటు ధనమును బ్యాంకులో వేయక తన వద్దనే వుంచుకొని, సదరు మొత్తంమీద రాగలవడ్డీ రానీయకుండా చేస్తూంది.

(7) ఎండోమెంటు జమా ఖర్చులు సక్రమముగా తగిన రశీదులు,వోచర్లతో వుంచలేదు.

(8) ట్రస్టు బిల్డింగుల అభివృద్ధికి, మరామతులకు చూపబడిన రు.6932-7-0 ఖర్చున్నూ, సిబ్బందికై చూపబడిన రు 5123-11-0 లున్నూ సాధారణ ఖర్చుల క్రింద చూపబడిన రు 2651-1-0 లున్నూ ప్రయాణ ఖర్చుల క్రింద చూపబడిన రు 1042-9-6 లున్నూ, భోజన ఖర్చుల క్రింద రు 821-7-9 లున్నూ, రు 71-11-6 లున్నూ; యివన్నియూ విపరీతమైన ఖర్చులు, నమ్మదగినవిగా లేవు.

ఎఫ్. డి. పెస్టన్‌జీ,
ప్రభుత్వ డిప్యూటీ సెక్రటరీ.

---

రష్యా వ్యవసాయ, పారిశ్రామిక ప్రదర్శనం మాస్కోలో ప్రారంభమైంది. సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు ప్రభుత్వ కమతాలు, ట్రాక్టరు యంత్ర కర్మాగారాలనుండి వచ్చిన విహారులు.

ఆంధ్ర వాణిజ్యమండలి (మద్రాసు)లో ప్రసంగిస్తున్న శ్రీ సంజీవరెడ్డి.

మద్రాసు ప్రముఖులు ఆంధ్ర ముఖ్యమంత్రి గౌరవార్థం చేసిన విందులో శ్రీ కామరాజు, శ్రీ సంజీవరెడ్డి.

ఎండ్లపల్లి (నల్గొండ జిల్లా) పాఠశాల భవనానికి మంత్రి శ్రీ వి. బి. రాజు గత వారం శంకుస్థాపన చేశారు.

---

## మదరాసు వార్తలు

మదరాసు, జులై 2: శ్రీ వి. వి. విశ్వనాథ అయ్యర్‌ను మదరాసు ప్రభుత్వం జులై 1 నుంచి ప్రభుత్వ న్యాయవాదిగా నియమించింది. సహాయ ప్రభుత్వ న్యాయవాదిగావున్న శ్రీ కె. వీరాస్వామి నాయుడును అదనపు ప్రభుత్వ న్యాయవాదిగా నియమించారు.

* * *

శెలవు అనంతరం దక్షిణరైల్వే ఛీఫ్ అపరేటింగ్ సూపరింటెండెంటు జులై 1 వ పనిలో చేరారు.

* * *

జులై మొదటివారంలో వనమహోత్సవం సందర్భాన ఇంటి ఆవరణలలోనూ, రోడ్ల ప్రక్కన సాధ్యమైనన్ని మొక్కలను నాటాలని నగర పురపాలక సంఘాధ్యక్షుడు శ్రీ కె. ఎస్. శ్రీనివాసన్ విజ్ఞప్తి చేస్తున్నారు. కావలసిన వారికి జులై 1 నుండి మైలేడీస్ గార్డెన్, రాబిన్సన్‌పార్కు, డా॥ నటేశ మొదలియార్ పార్కువద్ద చవకగా మొక్కలను అమ్ముతారు.

* * *

ప్రాంతీయ ఆహార డైరెక్టరు మైదా, అడ్డాకు ధరలను నిర్ణయించారు. సంచీ లేకుండా మైదాకు మణుగుకు రు 20.50 పైసలు, అడ్డాకు రు 12 లు ధర నిర్ణయించారు.

* * *

జూన్ 30 తేదీన కలరావల్ల ఒకరు చనిపోయినట్లు తెలిసింది. కలరాఅని అనుమానంతో 10 మందిని అంటువ్యాధుల ఆస్పత్రిలో చేర్చారు. ఇంతవరకు 168 మందికి కలరా తగిలి 15 గురు మరణించారు. 14 వేల మందికికలరా టీకాలు వేశారు.

* * *

రాష్ట్ర విద్యుచ్ఛక్తి మండలి ప్రథమ సమావేశం నిన్న సచివాలయంలో జరిగింది. శ్రీ ఎస్. కె. చెట్టూరు అధ్యక్షత వహించారు. ఈ సంవత్సరానికి విద్యుత్ శాఖ శాసన సభకు సమర్పించిన బడ్జెటునే తమబడ్జెటుగా ఆమోదించారు. మండలికి ఒక కార్యదర్శి నియమించాలని కూడా నిశ్చయించి ఒక పేరును రాష్ట్ర ప్రభుత్వానికి సూచించారు.

## నీటిపన్ను, దీపాల పన్ను హెచ్చింపు

తిరుపతి, జూన్ 30: పురపాలక సంఘం నిన్న శ్రీ సి. యస్. వీరస్వామి నాయుడు అధ్యక్షతన సమావేశమై దీపాలపన్ను ¼ శాతం, నీటిపన్ను నెలకు రూపాయినుంచి రూపాయన్నరకు హెచ్చించాలని ఉపసంఘం చేసిన సిఫార్సులను ఆమోదించారు. అక్టోబరు నుంచి ఇవి అమలులోకి వస్తాయి.

## స్వాతంత్ర్యోద్యమ శతవార్షికోత్సవాలు

### మూడురోజుల కార్యక్రమం

న్యూఢిల్లీ, జులై 1: భారతస్వాతంత్ర్యోద్యమ శతవార్షికోత్సవాలు ఆగస్టుమాసంలో మూడు రోజులపాటు జరుగుతాయి. ఈ సమయంలో జరిగే కార్యక్రమాన్ని యిప్పుడు తుదిసారిగా నిర్ణయించారు.

ఆగస్టు 14వ ప్రభాతభేరీ, పిల్లల కార్యక్రమాలు, రంగుదీపాలతో భవనాల అలంకరణ వగైరా ఉంటాయి.

రాష్ట్రపతి డా॥ రాజేంద్రప్రసాద్ సందేశంతోపాటు, దేశభక్తి పూరితమైన పాటలను ఆకాశవాణిలో ప్రసారం చేస్తారు.

రెండవరోజున మామూలుగా జరిగే స్వాతంత్ర్య దినోత్సవాలు కొనసాగుతాయి.

అదేరోజున ఎర్రకోటలో కవిసమ్మేళనంకూడా జరుగుతుంది.

ఆఖరురోజున, 1857 లగాయతు, 1947 వరకు భారత స్వాతంత్ర్యపోరాటంలో ప్రాణాలర్పించిన జాతీయ వీరుల స్మృతి చిహ్నానికి శ్రీ నెహ్రూ శంకుస్థాపన చేస్తారు.

నాటకాలు తదితర విజ్ఞాన ప్రదర్శనలుకూడా ఉంటాయి.

ఆఖరు రెండురోజుల్లోను రాష్ట్రపతి భవనంవద్ద, డా॥ రాజేంద్రప్రసాద్ విందుచేస్తారు.

## తిరుపతి టెలిఫోన్ సిబ్బంది జీతాల నిరాకరణ

తిరుపతి జులై 1: టెలిఫోన్ ఎక్స్ఛేంజి కార్యాలయ సిబ్బంది నేడు తమ జీతాలు తీసుకోలేదు. ఇంజనీరింగు సిబ్బంది విషయంలో కేంద్ర మంత్రి ప్రకటించిన సౌకర్యాలు అమలు జరపడానికి అనుమతి ఇంకా స్వీకరించనందుకు 'నిరసనగా' యీ చర్యకు పూనుకున్నారు. ఇతరశాఖలకు అనుమతి లభించింది.

## హిందూపురం పురపాలక సంఘం

### అధ్యక్షుడుగా కృష్ణయ్య చెట్టి ఎన్నిక

హిందూపురం, జులై 1: స్థానిక పురపాలక సంఘ అధ్యక్షుడుగా శ్రీ కె. ఆర్. కృష్ణయ్యచెట్టి ఎన్నికైనారు. అధ్యక్షుని ఎన్నుకునే నిమిత్తం పురపాలక సంఘం నిన్న ప్రత్యేక సమావేశం జరిపినది. పురపాలక సంఘానికి అధికార అధ్యక్షుడుగా ఇంతవరకు వ్యవహరిస్తున్న డెప్యూటి కలెక్టరు శ్రీ కె. సత్యనారాయణరావు సమావేశానికి అధ్యక్షత వహించారు.

మొదట పద్మాలగవ వార్డునుంచి ఇటీవల పురపాలక సంఘానికి ఎన్నిక అయిన ఇద్దరు సభ్యులు ప్రమాణం స్వీకరించారు.

తరువాత అధ్యక్షుని ఎన్నికకు శ్రీ అబ్దుల్ ఖాదర్ పేరు శ్రీ ఎస్. వెంకటరావు ప్రతిపాదించారు. శ్రీ ఎన్. మునియప్ప బలపరచారు. శ్రీ కె. ఆర్. కృష్ణయ్య చెట్టి పేరు శ్రీ ఎమ్. డి. ప్రకాశ్ ప్రతిపాదించగా శ్రీ పక్కా రాఘవేంద్రాచార్యులు బలపరచారు. పురపాలక సంఘ సభ్యులు మొత్తం 20 మందిలో 19 మంది సమావేశానికి హాజరైనారు. అధ్యక్షులు వోటింగులో పాల్గొనలేదు. శ్రీ కృష్ణయ్య చెట్టికి 12 ఓట్లు, శ్రీ ఖాదరుకు 5 ఓట్లు వచ్చినవి. శ్రీ కృష్ణయ్యచెట్టి అధ్యక్షుడుగా ఎన్నికైనట్లు శ్రీ సత్యనారాయణరావు ప్రకటించారు.

ఒక ఏడాదిపాటు పురపాలక సంఘానికి అధ్యక్షుడుగా సమావేశాలు సమర్థతతో నిర్వహించినందుకు శ్రీ సత్యనారాయణరావుకు పురపాలక సంఘం తరఫున శ్రీ అబుల్ వహీద్ సాహెబ్ కృతజ్ఞత తెలియపరచారు. సభ్యులు విభేదాలు విస్మరించి పట్టణ ప్రజల క్షేమానికిపాటు పడాలని శ్రీ కట్టా లక్ష్మీనారాయణయ్య విజ్ఞప్తి చేశారు.

## వరంగల్లు పురపాలక సంఘం

### అధ్యక్షుడుగా చెరుకు కాంతయ్య ఎన్నిక

(ఆంధ్రపత్రిక ప్రతినిధి)

వరంగల్లు, జులై 2: స్థానిక పురపాలక సంఘ అధ్యక్షుడుగా పురపాలక సంఘ కాంగ్రెసు పక్షనాయకుడు శ్రీ చెరుకు కాంతయ్య నిన్న ఎన్నికైనారు. అధ్యక్షుని ఎన్నుకొనే నిమిత్తం పురపాలక సంఘం నిన్న ప్రత్యేక సమావేశం జరిపినది. జిల్లా కలెక్టరు శ్రీ అనిల్ దే అధ్యక్షత వహించారు.

అధ్యక్షుని ఎన్నికకు ప్రతిపక్ష సభ్యుడు శ్రీ కాశీనాథం పేరు కూడా ప్రతిపాదించడం జరిగినది. కాని శ్రీ కాశీనాథం పోటీనుంచి ఉపసంహరించుకొన్నారు. శ్రీ చెరుకు కాంతయ్య పోటీలేకుండా అధ్యక్షులుగా ఎన్నికైనారు.

లోగడ పురపాలక సంఘ అధ్యక్షులుగా ఉన్న శ్రీ టి. హయగ్రీవాచారి శాసనసభకు ఎన్నికైన తరువాత అధ్యక్ష పదవికి రాజీనామా సమర్పించిన కారణంచేత తిరిగి అధ్యక్షుని ఎన్నుకొనడం ఆవశ్యకమైనది.

ఎన్నిక ముగిసినతరువాత శ్రీ కాంతయ్యను అభినందిస్తూ ప్రజాక్షేమం దృష్ట్యా పట్టణ అభివృద్ధికి తోడ్పడే కార్యక్రమాలలో ప్రతిపక్షం కాంగ్రెసుతో సహకరించగలదని శ్రీ మన్ మోహన్‌సింగు ప్రతిపక్షంతరఫున చెప్పారు.

నూతన అధ్యక్షుని అభినందిస్తూ, శ్రీ హయగ్రీవాచారి అధ్యక్షుడుగా ఉన్న కాలంలో పురపాలక సంఘానికి ప్రభుత్వానికి మధ్య ఎట్టి విభేదాలు లేవని సూచిస్తూ ఇకముందుకూడా ఎట్టి విభేదాలు ఏర్పడకుండా ఉంటవని ఆశిస్తున్నట్లు కలెక్టరు శ్రీ అనిల్ దే చెప్పారు. శ్రీ హయగ్రీవాచారి కూడా నూతన అధ్యక్షుని అభినందించారు. శ్రీ కాంతయ్య సభ్యులకు తన కృతజ్ఞత తెలియపరచారు.

## వైద్యశాస్త్రవేత్త రొనాల్డ్ రాస్

### జ్ఞాపకంగా సికిందరాబాదులో రోడ్డు

హైదరాబాదు, జులై 1: మలేరియా వ్యాధికి కారణమైన 'దోమను' కనిపెట్టిన ప్రముఖ శాస్త్రవేత్త సర్ రోనాల్డ్ రాస్ జ్ఞాపకార్థం సికిందరాబాదులో ఒక రోడ్డుకు ఆయన పేరు పెట్టారు.

1857 లో సికిందరాబాదు కంటోన్మెంట్‌లో సైనిక ఆసుపత్రిలో పనిచేస్తూ ఈ ప్రత్యేక దోమలసంగతి సందర్భాలను సర్ రోనాల్డ్ రాస్ కనిపెట్టారు.

సికిందరాబాదులో మహాత్మాగాంధీ రోడ్డునుంచి పోలీసులైన్సు సమీపంలో ఒక ఇంట్లో సర్ రాస్ అప్పుడు వుంటూండేవారు. ఆ రోడ్డుకు "సర్ రోనాల్డ్ రాస్ రోడ్డు" అని పేరుపెట్టారు.

---

కీ॥ శే॥ శ్రీ ఏ. కుప్పుస్వామినాయుడుగారు

గవర్నమెంటు పోలీసు పెన్షనర్, శ్రీ ఎ. కుప్పుస్వామినాయుడుగారు, తమ 81-వ యేట, 24 జూన్ 1957 రాత్రి 1-15 గంటలకు, చిత్తూరులోని వారి స్వగృహమందు స్వర్గస్థులైనారు. అంత్యక్రియలు 4-7-57 తేది ఉదయం 10-30 గంటలకు, చిత్తూరు, ధర్మరాజ ఆలయం తోటవద్ద జరుపబడును. వారి ఆత్మకు శాంతిని కోరు ప్రియ పుత్రులు. ఎ. కె. గోవిందరాజులు నాయుడు, ఎ. కె. రామచంద్రన్, ఎ. కె. ఆది కృష్ణమూర్తి, ఎ. కె. పురుషోత్తం ప్రియ మనుమడు ఎ. జి. పుణ్యకోటి. 124/10, స్వామిరెడ్డి వీధి, చిత్తూరు.

---

## టెండరు నోటీసు

నాగార్జునసాగర్ డామ్

ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు, (మెటీరియల్స్ డివిజన్) డివిజన్, విజయపురి(నార్తు) పోస్టు, నల్లగొండ జిల్లా వారిచే క్రింద వివరించిన పనులకు 15-7-1957 సా॥ 4 గంటల వరకు సీలువేసిన టెండర్లు డామ్ సైట్ ఎడమగట్టు, నందలి తమ ఆఫీసు నందు దాఖలు చేసికొనబడి, అదేదినం సా॥ 4-15 గం॥లకు తెరిచి పరీక్షింపబడును. టెండరు డాక్యుమెంట్లు 8-7-1957 తేదినుండి 13-7-57 వరకు ఆఫీసు పనిచేయు గంటలలో ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్, మెటీరియల్స్ డివిజన్ వారినుండి పొందవలెను. ఈ డాకుమెంట్లు సంతృప్తికరమైన గుర్తు పత్రములు దాఖలు చేసినవారికే యివ్వబడును. నిర్ణీతకాలములో పని పూర్తి చేయగల సామర్థ్యమును కంట్రాక్టరు కుండవలెను. కంట్రాక్టు ఫారము: లంప్ సమ్. టెండరు డాకుమెంట్ల ఖరీదు 10-0-0.

పని పూర్తి చేయుటకు నిర్ణయించిన తేదీ: 15-5-1958.

పనిపేరు:
పెదవాగునుండి యిసుక పోగుచేసి, ఎడమగట్టు మీది క్రషింగ్ ప్లాంటు సమీపమందలి బిన్నులవద్ద చేర్చుటకు

బయానా మొత్తము.
రు. 14,100/-పదనాలుగు వేల నూరు రూపాయలు మాత్రం.

---

## మధిర విద్యార్థుల సాంఘిక సేవ

ఖమ్మంమెట్టు, జూన్ 28: మధిరలోని బాపూజీ హరిజన వసతిగృహ విద్యార్థులు వేసవి సెలవలలో గ్రామాలలో ప్రారంభించిన సాంఘిక సేవా కార్యక్రమం మొన్నటితో ముగిసింది. వసతిగృహ అధ్యక్షులు శ్రీ వేమిరెడ్డి ప్రతాపరెడ్డి కార్యదర్శి శ్రీ సత్యనారాయణగారల నాయకత్వాన విద్యార్థులు రెండు జట్లుగా ఏర్పడి 46 రోజులలో మొత్తం 64 గ్రామాలు పర్యటించారు. బహిరంగసభలుజరిపి హరిజనుల ఇబ్బందులు, గ్రామస్థుల అవసరాలు తెలుసుకున్నారు. పారిశుధ్యం మద్యనిషేధ ప్రచారం, నిరక్షరాస్యత నిర్మూలన, వినోద కాలక్షేపాలు జరిపారు.

గ్రామస్థులు పూర్తిగా సహకరించి విరాళా లిచ్చారు. (స్వ. వి.)

---

ఆస్తి అమ్మకము

తిరువత్తియూరు హైరోడ్డు, తిరువత్తియూరు, మదరాసు (కందన్ టెక్స్టయిల్సు వెనుకవైపున) గల 5-45 యకరాలలో ఐరన్ ట్రస్సుల మీద గాల్వనైజ్‌డ్ ఐరన్ అండ్ ఆస్‌బెస్టాస్ షీట్లు పైకప్పుగల పెద్ద ఫ్యాక్టరీ కట్టడము వేలములో 15-7-57 తేదీన సా॥ 4-30 గంటలకు సదరు ఫ్యాక్టరీ ఆవరణములోనే, మదరాసు హైకోర్టు అఫిషియల్ లిక్విడేటరువారి అనుమతి మేరకు మ్రేస్ మదరాసు-1 వారిచే విక్రయింపబడును. పై ఆస్తులు లిక్విడేషన్‌లో వున్న మెసర్సు శెట్టి & రావు (ఇంజనీర్లు) లిమిటెడ్. వారికి చెందినవి.

---

## టెండరు నోటీసు

నాగార్జునసాగర్ డామ్

ఎగ్జిక్యూటివు ఇంజనీరు, రైట్ బ్యాంకు క్యాంపు డివిజన్ వారు యీ క్రింది పనులకు డాం సైటు, రైటు బ్యాంకు, పల్నాడు తాలూకా, గుంటూరుజిల్లా యందలి తమ ఆఫీసులో 22-7-57 తేదిన మధ్యాహ్నం 3 గం॥ల వరకు సీలువేసిన టెండర్లు దాఖలు చేసికొని అదే దినము సా॥ 4 గం॥ లకు తెరచి పరీక్షింతురు.

టెండరు డాకుమెంట్లు యితర కాగితములు ఆఫీసు పనిచేయు వేళలలో 7-7-57 నుండి 21-7-57 తేదీల మధ్య కాలములో సెట్టు 1 టికి రు. 4.06 వంతున చెల్లించి పొందవలెను. బయానా సొమ్ము బ్యాంకు డ్రాఫ్టు ద్వారా పే అండ్ అకౌంట్సు ఆఫీసరు, రైట్ బ్యాంకు, ఎన్. ఎస్. డాం వారి పేర చెల్లించవలెను.

పని పేరు: రైటు బ్యాంకు మీద ఆసుపత్రి కట్టుటకు
బయానా మొత్తం: రు. 1,500/-
పనిపూర్తికావలసిన కాలం : ఆరు నెలలు.
కంట్రాక్టు ఫారం :— K-2.

(Sd.) ఎ. వి. రాఘవరాజు
ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు,
రైట్ బ్యాంకు క్యాంప్సు డివిజన్,
నాగార్జున సాగర డామ్.

---





Printed and Published for Nageswara Rao Estate (private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street Madras-1. Editor S. Sambhuprasad.